శ్రీరస్తు.

# నీతికథామంజరి

ఇది

మాదిరాజు రఘునాథరావుగారిచే

రచియింపఁబడి

గుంటూరు

ప్రభాకర ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1941



[వెల పండ్రెండు అణాలు

# పండితాభిప్రాయములు

శ్రీ మాదిరాజు రఘునాథామాత్యప్రణీతంబగు 'నీతికథామంజరి' యను గద్యపద్యాత్మకమగు గ్రంథమును జూచితిని. పాకము ద్రాక్షాపాకము. నీతిని బోధించి, విద్యార్థులను సన్మార్గమున నడపుటకు మహోపకారము. తథాపి ఆంధ్ర విద్యార్థులకుఁ జదువుట కుత్సాహమును గల్గించుట కెంతయు నొప్పియున్నది. అర్థావబోధము కానప్పుడే విద్యార్థులు గ్రంథపఠనమునకుఁ గడంగరు. ఈ గ్రంథ మాలోపమును దీర్చినది. కావున విద్యార్థుల క్షేమముఁ గోరినచో నిట్టిగ్రంథములను విద్యాశాఖవారు, అవశ్యపఠనీయ ములఁగఁ జేయుదురని నేను నమ్ముచున్నాను.

గుంటూరు,
16—6—1941.

కాశీ కృష్ణాచార్యులు,
అవధానిశిరోమణి.



ఆర్యులారా!

మాదిరాజు రఘునాథామాత్యునిచే రచింపఁబడిన నీతికథామంజరియనుగ్రంథంబును స్థాలీపులాకన్యాయంబునఁ బరిశీలించియుంటిని. ఇయ్యది పరవస్తు చిన్నయసూరిచే రచింపఁబడిన నీతిచంద్రికయను గ్రంథము ననుసరించి నీతికథలన్నియుఁ బద్యరూపమున రచింపఁబడినది. ఈ ప్రబంధము పాఠశాలలయందు బాలురకుగాని తదితరులకుఁగాని యత్యంతోపకారియని గ్రంథనామముననే వెల్లడియగుచున్నది.

ఈకవి యిదివరలోఁ గొన్ని శతకములుగూడ రచించి యున్నాఁడు. ఈప్రబంధమందలి శైలినాతి కఠినమై, రసవత్తరమై పాఠకుల హృదయారవిందములఁ దనుపార్చుచున్నది. అచ్చటచ్చటఁ గొన్నికొన్నికథలయందలి వర్ణనములఁ బరికింపఁ బూర్వకవులను జ్ఞాపకముచేయుచుండును. వీరికిఁగల వ్యవహారకార్యములిట్టివని చెప్పనలవిగాదు. ఒకగడియయైనను తీరికలేని పనులున్నను, విసువుజెందక యాకార్యంబులన్నియుఁ జక్కబెట్టుకొనుచు మధ్యలో నేదియోయొకసమయమునఁ దనకుగల మేధాశక్తిచే నిట్టిగ్రంథములను రచించుచు వచ్చుచుండెడివాఁడు. ఇట్టి గ్రంథరచనాశక్తి సామాన్యముగ కార్యాంతరములుగలవాని కుండుట యరుదని నానమ్మకము.

ఎప్పుడుచూచినను వారిచిత్తము భావప్రపంచమునఁ దేలియాడుచుండును. కావుననే యెన్నిదుష్కరంబులగు కార్యంబులున్నను, భగవదనుగ్రహమువలన నిట్టిగ్రంథంబులు రచింపగలిగిరి. ఇక ముందైనను శ్రద్ధతో నిట్టికావ్యంబులనే రచించి శారదాపీఠంబున శారదాదేవికిఁ బుష్పమాలికలవలె నర్పింతురని నేను విశ్వసించుచున్నాను.

గుంటూరు,
20-6-1941.

ఇట్లు,
రత్నాకరం అనంతాచార్యులు,
ఉభయభాషాప్రవీణ, శతావధాని.



# విజ్ఞాపనము.

ఈ గ్రంథరచన కెంతయుం బట్టుదలయే కారణము గాని వేఱొండుకాదు. లేనియెడల నాకున్న కష్టములలో నిది నెఱవేఱెడిది కాదు. పురుషప్రయత్నమువలనఁగానిపనియే లేదని మొదటినుండియు నావిశ్వాసము. అందువలన నే నీపని నిర్వహింపఁగల్గితిని.

కం॥ గుడికూలును, నుయిపూడును,
వడినీరునఁ జెఱువు తెగును వననిధులింకున్
జెడనిది పద్యంబొక్కటి
కుడియెడమలఁ జూడకన్న గువ్వలచెన్నా.

అనుకరణి గ్రంథములవలె నితరము లెవ్వియు శాశ్వతములు గావని యెంచి మొదటినుండియు నెన్నిపనులు నన్ను బాధించుచున్నను "కవికిని శిల్పికిన్ కలముఁగైకొని వ్రాయుచు నున్న నూతెఱుఁగ్, నవనవచిత్రకల్పనలు" నను నార్యోక్తి ననుసరించి మధ్యమధ్యలో నేదియో యొక గద్యమో, పద్యమో, కీర్తనమో, శతకమో, వ్రాయుచుండెడివాఁడను. ఇదివరలోఁ గొన్ని శతకములను వ్రాసితిని.

మా మాతామహస్థానమువారు కవులేగాక వైద్య శాస్త్రవేత్తలుగూడ నగుటంబట్టి నేనుఁ గొంత వైద్య శాస్త్రమునందుఁ బరిశ్రమఁజొనరించి "చికిత్సానిధి" యను వైద్యశాస్త్రగ్రంథము నొకదానిని రచించియుంటిని.

ప్రస్తుతకాలమున నిట్టి గ్రంథములు చూచువారు లేకపోయినను "కాలోహ్యయం నిరవధిర్విపులాచ పృథ్వీ" యన్నట్లు విశాలభూమండలమునం దెప్పుడైనను జూచువా రుద్భవింపకమానరని తలంచి దేహబలముకంటె బుద్ధిబల మెకుడని బోధించు నీతిగ్రంథ మొకటి పద్యరూపమున నున్న సమంజసమని యూహించి యీ నీతికథామంజరియను గ్రంథ మును రచించితిని. కాన పండితులెల్లరు సుహృద్భావమున మన్నింపం బ్రార్థితులు.

ఈ గ్రంథమును శ్రద్ధగాం బరికించి తమ యభిప్రాయ మొసంగిన శ్రీమాన్ ఉభయభాషాప్రవీణ, శతావధానియు నగు రత్నాకరం అనంతాచార్యులవారికిని, అవధానిశిరోమణి, శ్రీ కాశీ కృష్ణాచార్యులవారికిని నేనెంతయుం గృతజ్ఞుఁడను.

ఇట్లు,

మాదిరాజు రఘునాధరావు.

# విషయసూచిక.

## ప్రథమాశ్వాసము


| | | | పుట |
|---|---|---|---|
| 1. | పావురములకథ | ... | 10 |
| 2. | మృగముకథ | ... | 17 |
| 3. | జరద్గవముకథ | ... | 19 |
| 4. | సన్యాసులకథ | ... | 28 |
| 5. | జంబుకముకథ | ... | 30 |


## ద్వితీయాశ్వాసము


| | | | |
|---|---|---|---|
| 6. | వానరముకథ | ... | 39 |
| 7. | రాసభముకథ | ... | 41 |
| 8. | జంబుకముకథ | ... | 44 |
| 9. | ఆషాఢభూతికథ | ... | 47 |
| 10. | కాకభుజంగములకథ | ... | 52 |
| 11. | కుందేలుకథ | ... | 62 |
| 12. | చీరపోతుకథ | ... | 67 |


## తృతీయాశ్వాసము


| | | | |
|---|---|---|---|
| 13. | ఒంటెకథ | ... | 72 |
| 14. | వడ్లంగికథ | ... | 77 |
| 15. | టిట్టిభముకథ | ... | 80 |
| 16. | తాబేలుకథ | ... | 82 |
| 17. | చేపలకథ | ... | 84 |
| 18. | సూచీముఖముకథ | ... | 89 |
| 19. | వర్తకులకథ | ... | 91 |
| 20. | కొంగకథ | ... | 96 |
| 21. | ధనగుప్తునికథ | ... | 99 |

శ్రీరస్తు.

శ్రీరామాయ నమః.

# నీతికథామంజరి

## ప్రథమాశ్వాసము



శ్రీరాధారమణుండు భక్తజనహృ ♦ త్సీమాలయుండుగ్రపా
కారాతి ద్రుహిణాదినిర్జర కిరీ ♦ టాంచన్మణీంద్రప్రభా
వారాలంకృతపాదపంకజుఁడునై ♦ వైకుంఠవాసుండు వి
స్తారైశ్వర్యములన్ శుభంబులనుని ♦ చ్చల్మాకుఁ జేకూర్చుతన్.

చ॥ కలుములరాణి పావని జ ♦ గంబులకున్ జనయిత్రి తన్నిలం
గొలుచుచునుండువారలకుఁ ♦ గోరినసంపదలిచ్చిప్రోవుగా
దిల్లి జలజాయతేక్షణుని ♦ దేవియునై చెలువాఱుచుండునా
కులుకుమిటారి పాల్కడలి ♦ కూతురుమాకిడిప్రోచుతన్ సిరుల్.

ఉ॥ శీర్షమునన్ వియన్నదినిఁ ♦ జేర్చి భవాని ధరించి మేన, సం
ఘర్షముమాన్పియిర్వురను ♦ గౌఁగిటఁదన్పుచు దక్షిణుండునా
హార్షముతోఁ దదీప్సితము ♦ లన్నియుఁ దీర్చిన శంకరుండు దు
ర్ధర్షసమస్తసంపదలొ ♦ సంగికృపన్ మముఁ బ్రోచుఁగావుతన్.

ఉ॥ గుబ్బలరేనికిం గలిగి ♦ గుబ్బలివిల్తునిఁ బెండ్లియాడి తా
గబ్బున లోకము ల్గలఁచు ♦ కాసర దైత్యు నణంచి దిక్కులం
బ్రబ్బిన సద్యశంబుఁగని ♦ భక్తులఁగాచు భవాని మమ్మిలన్
నిబ్బరికంబుతో నెపుడు ♦ నిత్యశుభంబు లొసంగి ప్రోచుతన్.

చ॥ ఎలమిఁదలిర్ప లోకముల ♦ నెల్ల సృజించుచు వెల్గు నాల్గుమో
ముల నివసింపఁజేసి యల ♦ ముద్దులపల్కుల కుల్కులాడి; ని
ర్మలకమలాసనంబున ర ♦ మాపతిఁగొల్చుచునుండునట్టి యా
పలుకులబోటిచెల్వుఁ డెడ ♦ బాయక మాకుఁజిరాయువీవుతన్.

చ॥ కులుకమిటారియై కలల ♦ కున్ నిధియై వెనువెంటఁ బ్రాఁతమి
న్కులతుద లేమెడం జెలుల ♦ కూటువులై వినుతింపముద్దరా
చిలుకకుఁ బాటలం గఱపు ♦ చిన్మయరూపిణి నల్వరాణి తా
నలరుచు నావిశాలరస ♦ నాంగణమందు నటించుఁగావుతన్.

ఉ॥ అబ్బురపాటుదోప లవ ♦ణాంబుధి రాము ననుజ్ఞ దాటి ప
ల్గబ్బితనంబునన్మెలఁగు ♦ కర్బురవీరులఁజంపి లంకఁ దా
నుబ్బునఁగాల్చి సీతకు ర ♦ ఘూత్తము ముద్రికనిచ్చితద్గతిం
దెబ్బున రామచంద్రునకుఁ ♦ దెల్పినమారుతి సన్నుతించెదన్.

## —♦ సుకవిస్తుతి ♦—

మ॥ నెనరుంబూని మురారిబాణకవి దం ♦ డిన్ బిల్హణుం గాళిదా
సుని మాఘున్ భవభూతిశంకరులభా ♦ సున్ ముమ్మటున్ భారవీం
ద్రుని శ్రీ హేమేంద్రునివిశ్వనాథకవిచం ♦ ద్రంగుంతకాచార్యవా
మనునింజోళకవీంద్రుని వచనసం ♦ పచ్ఛుద్ధి కర్థించెదన్.

## —♦ కవివంశాభివర్ణనము ♦—

చ॥ ఘనతరసద్యశోయుతుఁడు ♦ గౌరవనీయుఁడుఁ
గాశ్యపాన్వయాం
బునిధి విభావరీశ్వరుఁడు ♦ భూరికలానిపుణుండు లోకపా
వనగుణవంతుఁ డార్యజన ♦ వందితుఁడు త్తమ నిత్యసత్యవా
గ్వినుతుఁడుమాదిరాజుచెలఁ♦గెఁ ధరణింగవిమాననీయుఁడై.

సీ॥ బీదసాదులనెల్లఁ ♦ బేర్మితోనెపుడు రా
వించి వారల నాద ♦ రించునెవఁడుఁ
దగవులందీరుచు ♦ తఱిఁ బక్షపాతంబుఁ
బాసి న్యాయంబె తాఁ ♦ బల్కునెవఁడు
ధర్మకార్యములందు ♦ ద్రవ్యమర్పింప సం
ప్రీతితో ముందు గా ♦ ల్వెట్టునెవఁడు
నిరతంబుఁదాఁ జేయ ♦ నివ్వటిల్లిన యత్న
ముల భగీరథుఁద్రోయఁ ♦ గలుగునెవఁడు

గీ॥ నట్టి నగధీరుఁడధిక సా ♦ హసుఁడు మాది
రాజుకులమందు నాయక ♦ రత్నమగుట
మాకులంబునకీధాత్రి ♦ మాదిరాజు
నామమేయెడ విఖ్యాతి ♦ నామమయ్యె. 10

గీ॥ అవని నా మాదిరాజున ♦ కబ్బరాజు
కలిగె నాతఁడు మిగుల వి ♦ ఖ్యాతిఁగాంచి
ప్రబ్బఁగీరితి తనపేర ♦ నబ్బరాజు
పాలెమనుపురి నిర్మిం పఁ ♦ జాలెలీల. 11

కం॥ ఆయబ్బరాజు సచివున
కాయతవిద్యాప్రపూర్ణుఁ ♦ డతిశయకరుణా
ధీయుఁతుఁడు లోకనుత తే
జోయుతుఁడగు శరభరాజు ♦ క్షోణిజనించెన్. 12

వ॥ వానికి సోమరాజు, వీరరాజు, రామరాజు, శివరామరాజు నను నల్వురుపుత్రు లుదయించిరి. అందు రామరాజునకు శంకరయ్యయు, నమ్మిరాజు నను నిర్వురుకుమారు లుదయించిరి. అందు శంకరామాత్యునకుఁ గోటయాఖ్యుండు జనించె. అట్టి కోటయాఖ్యునకు నబ్బరాజు, రామబ్రహ్మము, కృష్ణయమంత్రి, ముత్యముబుధుఁడు నను నల్వురు కుమారు లుదయించిరి. అందు— 13

సీ॥ ఎవ్వాఁడు నిరతంబు ♦ నీశ్వరారాధనం
బుల మహాభక్తితో ♦ సలుపుచుండు
నెవ్వాఁడుఁ దగవుల ♦ నేర్చుకాలములందు
వెలచినాయంబుఁ ♦ దా వీడకుండు
నెవ్వాఁడు సత్యంబు ♦ నివ్వటిల్లఁ బరోప
కారంబు నొనరించి ♦ ఘనతఁగాంచు
నెవ్వాఁడు బీదల ♦ నెలమిమీఱఁగఁగాంచి
యన్నప్రదానంబు ♦ నాచరించు

గీ॥ నట్టి లోకైకపూజ్యుండు ♦ నమలకీర్తి
మంతుఁ డౌదార్య గాంభీర్య ♦ మాననీయుఁ
డతికృపాళుండు మాతండ్రి ♦ యబ్బరాజు
సచివు డలరారుచుండె నై ♦ శ్వర్యశాలి. 14

శా॥ ఆయుష్మంతులు సత్పుత్రులు న్నతులు సే♦ర్యన్ సర్వధాత్రీశ్వరో
ద్గేయుండై స్వయశంబు తాదశదిశా ♦ కీర్ణంబుగా సర్వదా
చేయంజాలి పతివ్రతాతిలకమై ♦ శీలంబు బాటించు జ
గ్గాయమ్మన్ సుగుణాంబురాశి నిలఁ బెం ♦ డ్లాడెన్ మదిం
గూరిమిన్. 15

సీ॥ ఏ రామ ప్రాక్తనా ♦ చారంబులఁ దలఁచి
సద్వ్రతంబులభక్తి ♦ సల్పుచుండు
నేసాధ్వికాంతల ♦ కెపుడు నాథుని సేవ
ఘనమోక్షదాయక ♦ మనితలంచు
నేసతీమణి మహో ♦ ల్లాసంబుతోఁ దుల
సీపూజ లెపుడుఁ దాఁ ♦ జేయుచుండు
నేయింటి బీదల ♦ కెల్ల వేళలఁ జికి
త్సావిధానంబులు ♦ సల్పుచుండు

గీ॥ నట్టి మాయమ్మ సుగుణమా ♦ న్యఁగరుణాత్మఁ
దారకపవిత్ర హృత్సీమ ♦ ధన్య జగ్గ
మాంగనామణి నా మాన ♦ సాంబుజమునఁ
దలఁతు నీయెడ నధిక మో ♦ దంబుతోడ. 16

వ॥ వార లిర్వురుఁ బురాణదంపతులకై వడి మెలంగుచుండ వారికి సదాశివ, రఘునాథ, సోమసుందరులను సుత త్రయంబును, కామాంబయు, నఖిలాండాంబయు, రత్న మాంబయు, రంగనాయకమ్మయు, శశిరేఖాంబయు నను పుత్రికారత్నపంచకంబును గలిగె. అందు ద్వితీయపుత్రుండ నగు నేను— 17

సీ॥ ఎలమితోఁ గాళహ ♦ స్తీశ్వర శతకంబుఁ
                గోరిసద్భక్తితోఁ ♦ గూర్చినాఁడ
నీతిబోధక భవా ♦ నీ శంకరశతకం
                బిలబుధుల్నుతియింప ♦ సలిపినాఁడ
శివునిభక్తిం బ్రతి ♦ ష్ఠించు వేళం జంద్ర
                హాసంబు నంకితం ♦ బందినాఁడఁ
దలఁచి మీఁదటఁ జికి ♦ త్సానిధి ప్రభృతిక
                గ్రంథంబులొనరింపఁ ♦ గలిగినాఁడ

గీ॥ నేఁటి కారాఘవుని దయ ♦ నీతిఁగూర్ప
దనరు నీతికథామంజ ♦ రి నొనరింపఁ
బూనితినిఁ గానఁ గల దోష ♦ ములను వీడి
గుణములె గ్రహింపుఁడో సూరి ♦ గణములార. 18

కం॥ ఘనతర తుభ్యారి కులాం
బునిధి సుధాకరుని లోక ♦ పూజితుఁ గవివం
ద్యునిఁ బిచ్చయాఖ్య మాతులు
మనమునఁ దలఁపోతు సుగుణ ♦ మాన్యుని నెపుడున్. 19

—♦ షష్ఠ్యంతములు ♦—

కం॥ శ్రీకరునకు నంబుజభవ
పాకారి ప్రముఖలోక ♦ పాలార్చితభ
ద్రాకారునకుం బుణ్య
శ్లోకునకున్ హరికి నిఖిల ♦ లోకాత్మునకున్. 20

కం॥ ధరణీధరరాట్తనయా
వరచాపవిభంజనునకు ♦ వనజాక్షునకున్
బరమకృపాంబుధికిన్ శుభ
కరునకు సీతాహృదబ్జ ♦ కంజాప్తునకున్. 21

కం॥ మేరునగధీరునకు సం
సారాంబుధితరికిఁ బరమ ♦ శాంతాత్మునకున్
శూరాగ్రేసరునకుఁ బా
పారణ్య దవానలునకుఁ ♦ బరమాత్మునకున్. 22

కం॥ సుందరరూపునకు జగ
ద్వందిత పాదాంబుజునకు ♦ దర్పితరక్షో
బృందాంతకునకు లోకా
నందకరునకున్ మహాత్మ ♦ నకు హతఫణికిన్. 23

కం॥ నీలాంబుదదేహునకున్
శూలాయుధ సేవితునకు ♦ సుకవినుతునకున్
లీలామఁదిరకాంచన
చేలునకుం గేశవునకు ♦ శ్రీరామునకున్. 24

వ॥ సమర్పణంబుగా నా యొనర్పంబూనిన నీతికథామంజరియను
మహా ప్రబంధమునకుఁ గథావిధానం బెట్టిదనిన— 25

---

# నీతికథామంజరి



## కథాప్రారంభము

గీ॥ శ్రీలఁ జెల్వారు నాకంబు ♦ లీలనధిక
పుణ్యగంగానదీతటం ♦ బునధరిత్రిఁ
బొల్పుమీఱెడిఁ బాటలీ ♦ పుత్రమనెడి
నగరమొకటుండు తొల్లి ప ♦ ల్వగలమించి. 1

ఉ॥ శ్రీరమణీవిహార సర ♦ సీజవిరాజిత భర్మహర్మ్య వి
స్తారనిభానిశాంతమణి ♦ జాలనిబద్ధవిలాసిశృంగసం
వారహతాంతరమై మిగుల ♦ భాసిలెఁ దన్నగరంబు సర్వబృం
దారకమాన్యవాతచలి ♦ తధ్వజపాళిపటాహతాబ్దమై.

మ॥ అలరెం దన్నగరంబు పార్థివసము ♦ ద్యద్దండయాత్రాస ము
త్కలికారింఖదు దీర్ణవిక్రమనట ♦ త్కంఖాణరింఖాహతో
జ్జ్వల దుద్దండమహీపరాగము మహా ♦ వార్యోర్మిజాలాదిని
స్తులవార్ధింబడితద్వినీలిమకు హే ♦ తుత్వంబుఁగాంచెన్ వెసన్.

గీ॥ ఆపురంబును జగముల ♦ నధికకరుణఁ
గాచునట్టి సుదర్శన ♦ కరుఁడనంగఁ
దనరునట్టి సుదర్శనుఁ ♦ డనెడిభూమి
పతివరేణ్యుఁడు నెపుడుఁ గా ♦ పాడుచుండు. 4

వ॥ అతఁ డొక్కనాడు వినోదార్థంబుగ విద్వాంసులతో సల్లా పంబులు గావించుచుండ నందొక్క బ్రాహ్మణుండు లేచి లోకంబునఁ బరువంబును, విభవంబును, ప్రభుత్వంబును, నరయమియు ననునాల్గింటిలో నొక్కక్కటియే యనర్థంబుఁ గల్గించుచుండ నొక్కచో నీ నాల్గున్నఁ జెప్పనలవియే ? కావున ననేకసందేహంబుల మాన్పి యగోచరార్థవిజ్ఞా నముఁ గల్పించు శాస్త్రము లోకులకు లోచనంబు. అట్టి లోచనం బెవ్వానికి లేకుండునో యట్టివాఁడె యంధుండని ప్రస్తావవశముగాఁ జెదివెను. 5

సీ॥ ఆసార్వభౌముఁ డ ♦ త్యానందమున లోన
నలరి తత్పద్యంబు ♦ లాలకించి
పిదపఁ దానాత్మీయ ♦ హృదయంబునను విచా
రంబుతో లేనిదుః ♦ ఖంబుఁగాంచి
యతిమూర్ఖులౌచు వి ♦ ద్యాహీనులై సదా
తనరారు నాత్మపు ♦ త్రకులఁజూచి
వీరు సుజ్ఞానులై ♦ వెలయుటెట్లని చెంత
గల బుధేంద్రులతోడఁ ♦ బలికెనిట్లు

గీ॥ మత్సుతులఁగొని మీలోన ♦ మహితనీతి
విదులఁ గావించువారలు ♦ వెలయుచుండి
రా ? యనివచింప విష్ణు శ ♦ ర్మయను విప్ర
పుంగవుఁడుపల్కె నిట్లని ♦ భూమిపతికి. 6

చ॥ పనిగొని దేవ! మీసుతులఁ♦బంపుడునావెనువెంటవారలన్
ఘనతరనీతివిజ్ఞులను ♦ గా నొనరించెదనంచుఁబల్కి తో
డనెకొనిపోయి వారల దృ♦ఢప్రతిభాత్ములఁజేయనెంచి యి
ట్లనివచియించె నీకథల ♦ నా ధరణీసురుడంత వారికిన్.

## —♦ పావురములకథ ♦—

సీ॥ ధాత్రితలంబున వి త్త ♦ సాధనసంప త్తి
లేనివారయ్యు వి ♦ జ్ఞానులెపుడు
నన్యోన్యమిత్రత్వ ♦ మార్జించికొని మైక్య
మునఁ గాకమృగకూర్మ ♦ మూషికములఁ
గైవడి నాత్మీయ ♦ కార్యంబులెల్ల సా
ధించుకొందురన నా ♦ లించి రాజ
తనయు లేకార్యంబు ♦ లను గాకమృగకూర్మ
మూషికంబులు నైక్య ♦ మునవసించి

గీ॥ మించి సాధించె వినిపింపు ♦ డంచుఁబలుక
వివిధశాస్త్రప్రవీణుండు ♦ విష్ణుశర్మ
డెందమున లేనిసంతోష ♦ మొంది వారి
చెంతఁగూర్చుండి యిట్లని ♦ చెప్పఁదొడఁగె. 8

సీ॥ దివ్య గోదావరీ ♦ తీరమందొక మహా
శాల్మలీ వృక్షరా ♦ జంబుగలదు
అన్నిదిక్కులనుండి ♦ యరుగుదెంచి ఖగంబు
లందు రాత్రుల నిద్ర ♦ లందుచుండు

నొకనాఁడు వేఁకువ ♦ నుత్సాహమున లఘు
పతనకంబనునట్టి ♦ వాయసంబు
తా లేచి రెండవ ♦ కాలునింబలె సంచ
రించుబోయనిఁజూచి ♦ యెంచె నిటుల

గీ॥ నేను వఱువాత మేల్కాంచి ♦ వీనిమొగముఁ
గాంచితిని నేడు కీడేమి ♦ గలుగునొక్కొ
తెలియదిఁక వీఁడువచ్చిన ♦ స్థలమునందు
నిలువకాచోటు విడిచిపో ♦ వలెనటంచు. 9

గీ॥ యత్నమొనరించుచుండ వాఁ ♦ డా మహీజ
మునకుఁ జెంగట నూకలు ♦ పోసిపిదపఁ
బన్ని వల; పోయి చేరువ ♦ నున్నపొదల
వేచి ఖగములకై పొంచి ♦ చూచుచుండె. 10

సీ॥ అపుడుఁ జిత్రగ్రీవు ♦ డను కపోతవిభుండు
సంచరించుచు నాక ♦ సమున నేల
నిాది నూకలుచూచి ♦ మోదంబునం దోడి
పావురంబులతోడఁ ♦ బలికెనిట్లు
కననిట్టినిర్జన ♦ వనమందు నూకలు
రానిమిత్తంబేమి ♦ వీనికొఱకు
మనమాశపడరాదు ♦ మహినిట్టియాశ యా
పదలకుం కారణ ♦ మెదియుఁగాని

గీ॥ యన్నివిధములఁ దలఁపని ♦ దాచరింపఁ
జేనదు; చక్కవిచారించి ♦ సలిపినట్టి
కార్యమున కెన్నటికి హాని ♦ కలుగబోద
టంచుఁ బెద్దలు వచియింతు ♦ రెంచిచూచి. 1

చ॥ అనవిని నవ్వి యచ్చెలువ ♦ సందుచు నొక్కకపోతవృద్ధ మి
ట్లనియె నివేటిమాట లొక ♦ యాపదగల్గినవేళ నొక్కవృ
ద్ధుని వచనంబులం దెలివి♦తో వినఁగాఁదగుఁగాని సందియం
బునఁ దలపోయుచుండ దొరకు♦భోజనమున్విడనాడవచ్చునే.

శా॥ స్థానాస్థానవివేకమెల్లెడల భ ♦ ద్రంబీయునంచేజనుం
డైనంగాని తలంపకిట్లునికి హా ♦ స్వస్థానభూతంబగుం
గానం బెద్దలుసెప్పువాక్యముల నా♦కర్ణించి తన్మార్గముం
బూనంజాలినవాఁడె ధన్యుఁడిలలో ♦ మూర్ఖత్వమిం కేటికిన్.

కం॥ దొరకినభోజనమును ని
క్కరణిన్ మానికొని యెట్లు ♦ గాఁ బ్రదుకఁదగున్
వెరవుగలవాఁడె ధన్యుం
డరయఁగ సిరియట్టివాని ♦ కబ్బు ధరిత్రిన్. 14

కం॥ సందేహముగలవానికి
నెందును సౌఖ్యంబుగలుగు ♦ నే యనవిని యా
నందంబునఁ బారావత
బృందంబులు నేలనొక్క ♦ పెట్టునవ్రాలెన్. 15

చ॥ చేదివి సమ స్తశాస్త్రముల ♦ సర్వమెఱింగినయట్టి నీతికో
విదులనుపాడులోభమున♦విభ్రమ మొందుచు జ్ఞానహీనులై
పదఁపడి లేనికష్టముల ♦ పాలగుచుందురు చింతలన్నియుం
గుదురుకొనంగజాలునిలఁ♦ గ్రూరపులోభగుణంబునన్ సదా.

వ॥ ఇట్లుతలఁచుచుఁ గపోతంబులు వలలోఁ దగులుకొని వృద్ధ
పారావతంబునుగాంచి యిట్లనియె— 17

ఉ॥ వృద్ధుఁడవీవు నిర్మలవి ♦ వేకయుతుండవటంచు నీదువా
క్పద్ధతి నిట్టులైతిమిట♦బాపురె! యెవ్వఁడు బుద్ధిమంతుఁడో
యిద్ధరలోనతండెకడు ♦ వృద్ధుఁడుగాని తదన్యుఁడేగతిన్
వృద్ధుఁడటంచుఁ బాపురము ♦ లీవిధినిందలు సేయన త్తరిన్.

కం॥ ఆగ్రహమునవిని తాఁ జి
త్రగ్రీవుండిట్టులనియెఁ ♦ దనవారలకున్
నిగ్రహమువచ్చునప్పుడు
నే గ్రహములు తోడుపడునె? ♦ యిదినిక్కమిలన్. 19

మ॥ తమకుందోచినరీతి నన్యులన స ♦ద్దానిన్విచారించి కా
ర్యములంజేయఁగ మేలు; లేకిటులఁజే♦యం గీడువాటిల్లునే
సమయంబందున నేదిచేయఁదగునో ♦ సద్బుద్ధితో దానిఁజే
యుమనీషాయుతుఁ డొందుసౌఖ్యముల నీ ♦ యుర్విన్
యశోవంతుఁడై. 20

ఉ॥ కార్యముతప్పివచ్చుతఱిఁ • గాఁగలయత్నముఁజేయుచున్ మదిన్
ధైర్యముతోఁ బ్రతిక్రియలు • దాఁదలపోయుట మేలు; దేహి యీ
కార్యముసాధ్యమాయనివి • కారముఁబొందఁగ రాదుకావునన్
స్థైర్యముతోవినుండిపుడె • దంబొడసూపినయుక్తి తెల్పెదన్.

ఉ॥ పంతమువీడివైక్యమును • బాయనిచో జనులెట్టి దానిసా
ధింతురు గడ్డిపోచలొక • దిట్టతనంబగు వెంటియై మహా
దంతినిఁగట్టుచున్నవిగ • దా మనమల్పులమైనఁగాని యీ
పొంతముతోడఁ బైకెగిరి • పోవుదమీ వలనెత్తికొంచిఁకన్.

చ॥ అనవినిపావురంబులెద • నబ్బురమందుచు మీదుచూచి చె
ప్పినవచనంబెయుక్తమని • బింకమునన్ వలతో వియత్పథం
బునకెగురంగ నప్పుడల • బోయఁడిదేమనియబ్రమొంది క్రిం
దనె చనుచుండె నీఖగవి • తానముఁబట్టెదనంచునయ్యెడన్.

ఉ॥ కాకముతద్విశేషమును • గన్గొనఁబోవుచునుండెనాఖగా
నీకము వెంబడించి గమ • నించుచుఁ; బిమ్మటఁ బావురంబు ల
త్యాకులితాత్మలన్ గగన • మంటివడిం గడుదూరమేగినన్
శోకముతోనతండునిలు • సొచ్చెరయంబునఁదా నిరాశుఁడై.

వ॥ పిమ్మటఁ బక్షులు మనకిత్తరిఁ గర్తవ్యంబేమియని కపోత
నాయకుం బ్రశ్నింపఁ జిత్రగ్రీవుండు ఖగంబులారా!
లోకంబునఁ దల్లిదండ్రులు, సఖుండు నను వీరుమువ్వురు

హితులని నీతికోవిదులు వక్కాణింతురు. కావున గండకీ తీరంబున నాకొక్క పరమమిత్రుండు హిరణ్యకుండను మూషికరాజుగలండు. అచ్చటికేగిన మనకు శ్రేయంబులు వాటిల్లునని చెప్ప నా ఖగంబులన్నియుఁ జిత్రగ్రీవునను మతంబున నట్లాచరించె. ఆసద్దునాలించి హిరణ్యకుండు లాఁగదూఱి మెదలకుండుటంజూచి చిత్రగ్రీవుండు బిలంబు చెంతఁజేరి యిట్లనియె— 25

మ॥ చెలికాడా! విపదంబుధిన్ మునిఁగిన్ ♦ జేరంగమాతోడనెం
దులకుంబల్కవసంగమూషికముసం♦తోషంబునన్ వచ్చివా
రలబంధంబులుచూచి యేమిదివిచా♦రంబయ్యెడెందంబునన్
గలనై జంబికఁ దీనికిందెలుపు మీ♦కార్యంబు సేకూర్చెదన్.

చ॥ అనవిని యాకపోతమిటు ♦ లాడెఁ బురాకృతకర్మమెందునై
నను గడువందరంబగునె ? ♦ నన్ననిశంబు భజించు వీరి బం
ధనముల ముందుగాఁగొఱికి♦నాపనిపిమ్మటజూడుమంచుఁ బ
ల్కిన నలమూషికంబు విచ♦లింపనిధైర్యముతోడనిట్లనెన్.

మ॥ హితుడా ! ధర్మపథప్రవర్తకుఁడవై ♦యిట్లుండనీయంచితా
శ్రితవాత్సల్య మదెన్ననాతర మె ? వి♦చ్ఛేదించి నీబంధమున్
హితముంగూరిచిమీద వీరిపని నా ♦ కేపాటిపీలుండినన్
యతనంబుంబొనరింతుఁజేయుటకు న్యా ♦ యంబిద్ది
యూహించినన్. 28

ఆ॥ వె॥ మహిని నెపుడుఁ "దన్ను♦ మాలిన ధర్మంబు
మొదలు చెడ్డబేర ♦ ము" గలదా య

టంచుఁ బలుకు-మాట ♦ నాలింపవా ? ధర్మ
విపులచెంతఁజేరి ♦ వితరణగుణ ! 29

చ॥ అనిశముఁ దాసమ స్తపురు ♦ షార్థములన్మనియుండియేకదా
జనుఁడుఘటించుకొంట మహిఁ♦జెచ్చినపిమ్మట దేనితోడనై
నను పనియేమనంగ విని ♦ న్యాయమె నీవచనంబదెట్లనై
నను నిటునాభటా_ర్తిఁగని♦నామదినిల్వదటంచుఁగూరిమిన్.

ఉ॥ ఇంతగనొక్కి-చెప్పితి ని ♦ కేమనిపలుకు-దునంచుఁ బావురం
బెంతయువిన్నవింపఁగ న♦హీనకృపాత్మ హిరణ్యకుండు దా
సంతసమొంది నాకుఁగల ♦ శ_క్తికిమించిన కార్యమెట్లు కా
వింతుసనం గపోతము వి ♦ వేకమతిన్ వచియించెనీగతిన్.

చ॥ హితమతినాప్రభుత్వమున ♦ నింతకువీరికిలాభమేమి ? నీ
మతిఁదలపోసిదీని జన♦మాన్య యశంబునుగూర్పుమయ్య జీ
వితము లశాశ్వతంబులని ♦ విజ్ఞులుపలుకు-చునుంద్రు దీని నీ
క్షితి నెఱుఁగంగలేక నిర♦సింతురు దుష్టులు నీతిమార్గమున్.

చ॥ అనఁగ హిరణ్యకుండపుడు♦నన్నిటిబంధములూడ్చినైచి వా
నిని గడునాదరించి దయ♦నీకుసమానుఁడెవండు ? ధాత్రి నె
వ్వనికయినం బురాకృతము ♦ పాయునెయంచని
యూరడించి పం
పె నలకపోతరాజమును ♦ ప్రీతిమతిన్ బలగంబుతోసరున్.

కం॥ పిమ్మటఁ జిత్రగ్రీవుఁడు
నమ్మినబలగంబుతో జ ♦ నంబులు సంతో

షమ్ము నవినుతింపఁగ గే
హమ్మునకరుదెంచె నతిర ♦ యమ్మునవపుడున్. 34

ఉ॥ దీనినిఁజూచుకాకముమ♦ దిన్ముద మొందుచు నేగుదెంచి య
ద్దానిబిలంబుఁ జేరికడుఁ ♦ దాల్మి హిరణ్యకుసన్నుతించి నీ
వానిఁగనన్నుఁజూడుము కృ ♦ పామతినీదగు చెల్మిఁగోరియే
నేనరుదెంచినాఁడనిఁక ♦ నీదయ మాదగుభాగ్యమంచనన్.

ఉ॥ మూషికనాయకుండువిని♦ మోమునహాసముదోపఁ గాకమా!
దోషములెంచు దుర్జనుల ♦ తో సహవాసమదెట్లుకూడు నీ
వేషము నే నెఱుంగనె ? వి♦ వేకమతిన్దలపోయు మాత్మవి
ద్వేషులతోడిమైత్రి తగ ♦ వే? నగ రే యిఁక మాటలేటికిన్.

వ॥ మఱియు నీకింతులకుఁ దార్కాణంబుగ నొక్క యితి
హాసంబుఁ జెప్పెదను. పూర్వ మొక మృగంబు జంబుకం
బును విశ్వసించి దాని కపటవాక్యంబులకు లోంగి పాశంబు
లం దగుల్కొని వాయసంబుచే రక్షింపఁబడిమోఁ
దదవృత్తాంతంబు నాకర్ణింపుమని హిరణ్యకుండు కాకంబున
కిట్లనియె.— 37

—♦ మృ గ ము క థ ♦—

సీ॥ మగధదేశంబున ♦ మందారవతియను
కాంతారమొక్కండు ♦ కలదు దాన
బహుదిసంబులనుండి ♦ పరమసఖ్యంబున
మృగకాకములు రెండు ♦ మెలఁగుచుండె

నామృగంబు వనంబు ♦ నందు విచ్చలవిడిఁ
జరియించుచుండ వం ♦ చకమొకండు
కని యిట్లుచింతించెఁ ♦ గడులెస్సగాఁ బోత
రించి యీజింక వ ♦ ర్తించుచుండె

గీ॥ నెట్లు నాకులభించు నీ ♦ మృగపలలము
టంచు లోలోనఁ గడు విచా ♦ రించి తుదకు
దీనికిట నమ్మకము పుట్టఁ ♦ గా నొనర్ప
వలెనటంచిటు చెంతకు ♦ వచ్చి పలికె. 38

ఉ॥ భద్రమె?మిత్రుఁడా!యనుచుఁ♦బల్కెన; నెవ్వఁడవీవటంచునా
క్షుద్రసృగాలరాజమును ♦ గూర్చి మృగంబడుగంగ నర్థిక
ల్పద్రుమ! నేనుబుద్ధియను♦వంచక నాథుఁడనన్నుఁజుట్టముల్
నిద్రలలోననుండుతఱి ♦ నించి వనంబునఁ బోయిరిండ్లకున్.

ఉ॥ సజ్జనదర్శనంబవని ♦ సర్వవిధంబుల మేలటంచు వి
ద్వజ్జనులాడువాక్యమది ♦ వ్యర్థమె ? నీవిఁక నాకుఁజూడ నా
పజ్జలరాశినొకవని ♦ భావమునంబొడగట్టెఁగాన నీ
పజ్జవసింతు నీచెలిమి ♦ భావ్యమటంచనితోఁచె నెమ్మదిన్.

ఉ॥ కావున వేఱుభావమునఁ ♦ గాదనిచెప్పక నామనోరథం
బేవిధినైనఁదీర్పుమన♦నెంతయుఁగూరిమితోమృగంబు తా
నీవెటులంటివో యటుల ♦ నే యగుగాకయటంచునక్కతో
స్వావసథంబుఁజేరెఁ జర♦మాద్రిదినేశుఁడుగ్రుంకునంతకున్.

సీ॥ మందారవృక్షంబు ♦ నందున్న కాకంబు
తనమిత్రమైన లే ♦ డినటఁగాంచి
ప్రశ్నింప నీతఁడౌ ♦ వ్వండంచు నాజింక
వినుమితండు సుబుద్ధి ♦ యనెడి జంబు
కేసుండు నాచెల్మి ♦ నాశించి వచ్చినాఁ
డనివచింపఁ దదుక్తి ♦ లాలకించి
వాయసంబిట్టుల ♦ వాక్రుచ్చెఁ గ్రొత్తవా
నినినమ్మ నీవుచే ♦ సినవిధంబు

గీ॥ మేలుగాదెందు నవ్వాని ♦ శీలగుణము
లెఱుగకెవ్వానికిటులఁ దా ♦ విడుటతగదు
తొల్లిపిల్లికితావిచ్చి ♦ తొల్లులో జ
రద్గవను నెడు చీఁకు గృ ♦ ధ్రంబుచచ్చె. 42

గీ॥ హితునికై వడిఁ జెంగటి ♦ కేగుదెంచి
తగిన సాయంబుఁగాంచి మీ ♦ దటఁజేలంబు
మీఱదాలోనఁజేసిన ♦ మేలుమఱచు
వానికంటెను పాపుండు ♦ వసుధఁగలఁడె. 43

—♦ జరద్గవము కథ ♦—

సీ॥ దివ్యభాగీరథీ ♦ తీరంబునన్మహా
పర్కటీవృక్షంబు ♦ పరగుచుండె
నిరతంబు దాని కో ♦ టరములోన జరద్గ
వమను గృధ్రము నివా ♦ సముగనుండె

నాచెట్టుమీాద ను ♦ న్నట్టి పక్షికులంబు
జీవనంబునకునై ♦ చీఁకుగృధ్ర
మునకుఁ దామెచటనై ♦ నను తెచ్చికొన్నట్టి
యెరలోనఁ గొంచెంబు ♦ నిచ్చుచుండ

గీ॥ జీవనంబది దానిచేఁ ♦ జేయుచుండె
దీర్ఘకర్ణంబనెడుపిల్లి ♦ తెలివిగలిగి
పక్కికూనలభక్షింప ♦ నొక్కనాఁడు
పూని ధ్వనిలేకవచ్చెనా ♦ గ్రమానికడకు. 44

ఉ॥ అంతట దానిరాకఁగని ♦ యాఖగసంతతి కూయసాగె న
త్యంతభయంబుతోఁబొదలి;♦యారవమువ్విని చీఁకుగద్ద యి
చ్చెంతకునెవ్వఁడోపరుఁడుఁ♦జేరెనటంచుఁదలంచి యెవ్వరా
పొంతలనుండువారనుచుఁ♦బోయెనుదానటకుర్జవంబునన్.

ఉ॥ అప్పుడునాబిడాలము భ♦యంబునఁగన్గొని వృద్ధగృధ్రముం
దిప్పలువచ్చె దీనికొక ♦ తెన్నుదలంచుట మేలటంచుఁ దా
ముప్పుదొలంగఁ గేల్మొగిచి ♦ ముందటనిల్వ నెవండవీవు నీ
చొప్పెఱుఁగంగవచ్చెనని♦చూచెబిడాలముగృధ్రమంతటన్.

ఉ॥ అద్దియు దీర్ఘకర్ణమను ♦ నట్టిబిడాలమనేను ; విద్దెలం
బెద్దవునీవు; లోకమునఁ ♦ బేరువహించినవాఁడవౌచు నీ
యొద్దవసించి ధర్మములు ♦ నోలివినం జేనుదెంచినాఁడ నా
ముద్దుఘటింపుమింక నను♦మూర్ఖునిగై వశిఁజూడఁబోకుమీ.

సీ॥ అనిపల్క నామాట ♦ లాలించి గృధ్రమి
ట్లనియె లోకంబున ♦ నతిశయముగ
మార్జాలములకెల్ల ♦ మాంసంబునం బ్రీతి
నిటఁబక్కికూన లుం ♦ డుటనుబట్టి
యిట్లంటివనఁ బిల్లి ♦ యెంతపాపమొనర్చి
యీజన్మమెత్తితో ♦ యిదియుఁజాల
కీపాపమునుసైత ♦ మిటుకట్టుకోవలె
నా? యెంతమాట వి ♦ సంగనయ్యొ

గీ॥ నేను చాంద్రాయణవ్రత ♦ మూనియుంటి
నిట్టిపాపంబు సల్పుదు ♦ నే సమస్త
దానధర్మంబులాభూత ♦ దయకు సాటి
రాగలవె? పోవువేళ ధ ♦ ర్మంబెతోడు. 48

ఉ॥ కట్టిడిపాట్లకిట్టి కడ ♦ గండ్లకు నేయెడఁజిక్కియుండు టీ
పొట్టకుఁగానిపుణ్యములఁ ♦ బొందుటకా? జనుఁడీధరిత్రి నీ
గుట్టునెఱింగిధర్మములఁ ♦ గోవిదులేయెడఁ జేయుచుందు రె
ప్పట్టుననైనఁ; గూళలిది♦పాడియటంచని సేయ రెంచిరా.

మ॥ తగుచందంబున నాబిడాలమిటులన్ ♦ ధర్మోపదేశంబుఁజే
యఁగఁగృధ్రంబటనాలకించియలుకే♦లానాదువాక్యంబు త
ప్పుగ భావింపకుమోబిడాలమ! మహా♦పుణ్యస్వరూపుండవై
జగతిన్ వర్తిలునీదుసద్గుణములన్♦సాధ్యంబె?వర్ణింపఁగన్.

ఉ॥ కావున దీనినీగృహము♦గాఁదలఁపోయుచురమ్ము పొమ్ము
భావమెఱుంగవచ్చెనని ♦ పల్క జరద్గవమంతఁ బిల్లితాఁ
బోవుచువచ్చుచుం జెలిమి♦పుట్టనటించుచుఁ గొంతకాల వి
శ్వాసవిధనైన నమ్మకము ♦ నే కలిగించుచునుండె నచ్చటన్.

మ॥ పిదపం దానొకయర్ధరాత్రమున నా♦వృక్షంబుపైగూండ్లలో
నిదురం గాంచెడుపక్షిశాబకము ల♦న్నింటి న్వేసం దెచ్చి వే
రొండ లేకుండఁగఁగోటరాంతరమునన్ ♦ద్రుంగించిభక్షించిపో
యెదురాత్మం;దమపిల్లలంగనక యెం♦తేనిన్విలాపించుచున్.

ఉ॥ అచ్చటిఖేచరప్రతతు ♦ లచ్చటనచ్చటఁజూచుచుండ నా
ద్రుచ్చుబిడాలమీవిషయ♦మున్ మదిలోననెఱింగిపోయె నీ
చిచ్చుభరింపలేకొకటఁ ♦ జేరిఖగంబులు గొట్టుచెంతకున్
వచ్చి సుతాస్థితండములఁ ♦ వ మిగనుంగొని లోనసల్గుచున్.

ఉ॥ ద్రుచ్చువలెన్నెలంగి మన ♦ ముద్దులబిడ్డల నిద్దిచంపి తాఁ
దెచ్చిభుజించుచుండెనని♦తీవ్రనఖంబుల ముక్కులన్
వచ్చి జరద్గవంబునటఁ ♦ బట్టివధించెనుగానఁ గ్రొత్తగా
వచ్చినవాని నమ్మఁదగ ♦ వాయని చెప్పితినంచుఁబల్కినన్.

శా॥ ఆమాటల్విని జంబుకం బధిక రో ♦ షాయత్తచిత్తంబునన్
నీమార్గంబుసహింపరానిదెవరే♦నిన్ ముందుగాఁ గ్రొత్తయే
సామాన్యుంబలెనన్నుఁబల్కెదవుసం♦శ్లాఘ్యుం బె? నీవాక్యమే
ధీమంతుల్వచియింపరిట్లపుడు నీ ♦ తిస్ఫూర్తిచేతస్కులై.

ఉ॥ ఒంటిగ నుట్టిగట్టుకొని ♦ యాగమిటం గలకాలమెప్పుడో
తుంటరిదండపాణి పడఁ♦ద్రోయఁగ వెంట నెకాచియుండె ని
క్కొంచెతనంబునన్ యశము ♦ గూడునె? యందఱు
మిట్టులేకమై
యుంట శుభంబుగాదెయన ♦ నొప్పుకొనెన్ మృగ
కాకములెవ్వరున్. 56

వ॥ అంతట మృగకాకజంబుకంబు లపారమిత్రభావంబుల వసించుచుండె. ఇట్లు కతిపయదినంబులు గడువ నొక్కనాఁ డావంచకంబు మృగంబును వెంటఁబెట్టుకొనిపోయి సస్య శ్యామలకోమలంబగు నొక్కక్షేత్రంబుఁజూప నాహారిణంబు దినదినంబున నటకేగి నారగింపసాగె. నొక్కనాడు— 57

మ॥ తగుయత్నంబునఁ బొంచియుండి యది క్షే ♦ త్రస్వామి
వీక్షించి యా
మృగమీనై ఖరిఁ బై రుమేయమరిగెన్ ♦ మేలాఁకించి
యిద్దానినిం
దెగటార్పందగు నింకనై నయనుచున్ ♦ నిమ్నప్రదేశంబునం
దిగఁజాఱన్వలఁబన్ని యింటికరిగెం ♦ దీవ్రప్రకోపంబునన్.

సీ॥ ఎప్పటియలవాటు ♦ చొప్పున మఱునాడు
తగువేగిరంబున ♦ మృగమువచ్చి
పొలములోపలికేగి ♦ వలలోఁదగులొక్కని
చింతించి చింతించి ♦ కొంతవడికి

నూహించెనిట్లు నా ♦ స్నేహితుండగు వంచ
కవిభుండు వచ్చెనా ♦ కలిగినట్టి
యీవిపత్తునణంచి ♦ బ్రోవఁజాలునటంచుఁ
దలపోయుచుండ న ♦ త్తరి సృగాల

గీ॥ మరుగుదెంచి ఫలించె నా ♦ యత్నమనుచు
సంతసించుచులోనఁ దా ♦ సఖునిఁ జేర
మృగము కని దానిఁ జెలువుఁడా ! ♦ వగపుమాన్పి
నన్ను రక్షింపుమని చాల ♦ సన్నుతించె. 59

సీ॥ పిదప నాజంబుక ♦ విభుఁడు చెంతకువచ్చి
వలఁజూచి యీ వల ♦ నులినరములఁ
గట్టినయది నేఁడు ♦ భట్టారకదినంబు
నరములనెట్లు దం ♦ తములనంటు
దు నటంచునరిగె నం ♦ తనటఁగాకము లేడి
తావుచేరమికిఁ జిం ♦ తలవగచుచు
నటకేగుదెంచి యా ♦ హరిణముంగని యేమి
దియటంచునడిగె స ♦ త్ప్రియునిమాట

గీ॥ విననిదానికి ఫలమిద్ది ♦ వినుము పుడమిఁ
జేటుకాలము దాపరిం ♦ చిన జనుండు
హితులు బోధించువచనంబు ♦ లేల వినున
టంచు దుఃఖంబుతోడ నా ♦ హరిణమనియె. 60

గీ॥ అనిన నాలించి యాకాక ♦ మపుడు సఖుఁడ !
కుమతి నాశనకాలంబు ♦ కూడినపుడుఁ
గనడరుంధతి మిత్రవా ♦ క్యంబువినడు
దీపగంధంబు మూర్ఖాన ♦ నోపడనియె. 61

చ॥ పలుకుచునిట్లుతోఁచినయు♦పాయముఁదెల్పెదనాలకింపుమీ
చెలువుఁడ! కాళ్లుచాచుకొని♦జీవము లేనివిధంబుఁజూపుచుఁ
మెలఁగుము; నేనునీతనువు♦మీఁద నటించుచుముక్కుతోడఁగ
న్నులు పొడువంజెలంగిన వి ♦ నోదముఁజూపుచునుండి
పిమ్మటన్. 62

చ॥ సమయముఁజూచికూసెద వె♦ సంబరుగెత్తుమటంచుఁదెల్పనా
క్రమమునునుండెనామృగము♦కాపటుమీఁదటవచ్చిచెంతకున్
సమసెమృగంబటంచు వల♦జార్చినఁ గాకముకూయసాగె శీ
ఘ్రముముగఁ దబారవంబువిని♦గాఢరయంబున లేడిపర్విడెన్.

ఉ॥ ఎత్తగబంధమిట్టులిది ♦ యెంతటి మాయలమారి లేడియో
యి త్తెరిమోసగించెనను♦నేమనుకొన్నఫలంబెయంచుఁ దాఁ
జిత్తమునందుఁగోపమునఁ ♦ జేబడియంగొనిఁ వేయఁగాపు ప
ల్జిత్తులమారినక్కసమ ♦ సెన్ గతిసంబగు దానితాకునన్.

గీ॥ ఉల్లమున నెట్లు తలపోయు ♦ చుండెనక్క
తుదకునేమాయె ?; బరులకు ♦ ద్రోహమెంచు
వారు చెడిపోదురెపుడు నె ♦ వ్వారలైన
నడిచి తమగోతిలోఁ దామె ♦ పడుదురవని. 65

చ॥ అనవిని యాహిరణ్యకున ♦ కబ్బురమందుచుఁగాకమిట్లనెన్
ఘనతరమిత్రభావము జ ♦ గంబుననన్నిటిలో విశేషమం
చు నిరతమార్యులండ్రు; విను ♦ చుర్ల బహుధర్మము
లిట్లుసేయ నా
మనవినితోసిపుచ్చకుము♦మాన్యులులోకహితార్థతత్పరుల్.

కం॥ సజ్జనసాంగత్యము వి
ద్వజ్జనపూజ్యంబు; నిఖిల ♦ భద్రాలయమా
ముజ్జగముల హృద్బంధన
రజ్జువు; శ్లాఘింపఁగాఁ ద ♦ రమె ? యిద్ధాత్రిన్. 67

చ॥ అనఁగహిరణ్యకుండుకడు♦సద్భుతమందుచుఁ జెల్మిఁగాకముం
గని భవదుక్తులిట్లు వినఁ♦గావినఁగాహృదయంబుపొంగె నెం
దునఁదలపోసిచూడ నొక♦దోషమునీకడఁ దోపదాయెఁ గా
వునఁ దగునీదుచెల్మి; నినుఁ ♦ బోలుఘనుండొకడున్నె ?
మేదినిన్. 68

సీ॥ అనిపల్కి యాహిర ♦ ణ్యకుఁడు యథోచిత
సత్కారములుచేసి ♦ సంతసమున
వీడ్కొల్పి కాకంబు ♦ వివరంబుఁ దూఱె న
ప్పటినుండి మూషిక ♦ వాయసంబు
లన్యోన్యమైత్రిచే ♦ నధివసించుచునుండె
నొకనాఁడు కాకి మూ ♦ షికముఁ జూచి
మిత్రుఁడా ! నాకు నీ ♦ క్షేత్రంబునందు నా
హారంబు సేకూర ♦ దాయెఁగాన

గీ॥ నీవనంబును విడనాడి ♦ యెచటికేనిఁ
దగినచోటికిఁ బోవు య ♦ త్నంబుతోడ
నుంటివనిపల్క మూషిక ♦ మోసఖుండ !
ధర్మమార్గంబు ♦ తలపుమీ దైన్యమేల. 69

గీ॥ తగినవిధమున కేశదం ♦ తనరనఖము
లవనిలో స్థానవిభ్రంశ ♦ మొందెనేని
నెటులనైనను రాణింప ♦ వెలమితోడ
వినుము నామాట నీవు కా ♦ దనక తలఁచి. 70

చ॥ అనివచియింప నందులకు♦నయ్యెడ వాయసమిట్లుపల్కెనో
ఘనసుగుణాంబురాశి ! యొక ♦ కష్టముగల్గిన దానినెట్టులై
ననుఁ గడుఁదాల్మిఁ బాపుకొని ♦ న్యాయపథంబున సంచ
రించుచున్
మనువిబుధుండు కీర్తిఁగని♦మాన్యుఁడనన్ సతతంబువర్ధిలున్.

సీ॥ కాన జీవనము స ♦ మ్మానంబు బాంధవు
ల్విద్యాగమము లేని ♦ విషయమెపుడుఁ
దాహ్యజ్యంబటంచుఁ బె ♦ ద్దలు చెప్పుచుంద్రు నా
మాటలన్వినుము ము ♦ మ్మాటి కిపుడు
గలదొండు కర్పూర ♦ గౌరంబను సరోవ
రంబల్ల దండకా ♦ రణ్యమందు
నందునాప్రియమిత్రుఁ ♦ డలరు మంథరుఁడను
కూర్మనాధుఁడు మహా ♦ ధార్మికుండు

గీ॥ నిన్ను నాతోడ నాకూర్మ ♦ మున్నచోటి
కిపుడుఁ దోడ్కొనిపోయెద ♦ నేల చింత
యనఁగ నిర్వురుఁ బయనమై ♦ చనుచుఁ గొన్ని
దినములకుఁ జేరి రాహ్రదం ♦ బును ముదమున. 71

ఉ॥ వచ్చినవారి మంథరుఁడ ♦ వార్యకృపామతి నాదరించి తా
ముచ్చటలాడి కొంతవడి♦మూషికనాయకుఁగాంచిచెల్మితో
నెచ్చెలి ! వచ్చి నీవిటుల ♦ నిర్జనకాననమందునుంట నా
కచ్చెరువాయె నిట్టులగు♦నంతకుఁ గారణమేమి తెల్పుమా.

చ॥ అనఁగహిరణ్యకుండపుడు♦నక్కమఠంబునుజూచిదుఃఖముం
గనిసుగుణాఢ్య! నిన్నిపుడుఁ♦గాంచిన నాహితులెల్ల రేగుదెం
చినగతిఁ దోచె నేవనికిఁ ♦ జేరిన సంగతి నీకుఁ దెల్పెదన్
వినుమనిచెప్పఁబూనెఁదన♦ వింతచరిత్రముమిత్రపాత్రముల్.

—♦ సన్యాసులకథ ♦—

కం॥ ఘనతరనవరత్నస్థగి
తనిలయబృందముల దేవ ♦ తా నగరము నెం
దున నవ్వెడు చంపకవతి
యను నగరమొకందుఁ బుడమి ♦ నలరుచునుండెన్. 74

సీ॥ అచటఁ బెక్కండ్రు స ♦ న్యాసులేమెడ నుందు
రందుఁ జూడాకర్ణుఁ ♦ డనునతండు
భుజియించి మిగిలిన ♦ బోనంబు తనదు భి
క్షాపాత్రమునఁ బెట్టి ♦ సద్దులేక

కూర్కు-వేళలఁ జిల్క-♦ కొయ్యపైనుంచి తా
నిద్రించుఁ బిమ్మట ♦ నేనుదాని
పైకేగి ప్రతిదినం ♦ బాకూడు భక్షించి
చేనుచుండ నొకదినం ♦ బున నతండు

గీ॥ తనదు హితుని వీణాకర్ణుఁ ♦ గని తలంచి
మాటలాడుచు ననుమాటి ♦ మాటికవనిఁ
గఱ్ఱతోఁగొట్టి వెఱపింపఁ ♦ గాఁదొడంగె
నదియుఁగాంచి వీణాకర్ణుఁ ♦ డనియెనిట్లు. 75

ఉ. నేడిదియేమి మీఁదుఁగని ♦ నేలను దండముతోడఁ దట్టుచు
న్నాడవటంచుఁ దానడిగి♦సంభ్రమముండ నెనొక్క-మూషికం
బేడవసించెనో తెలియ ♦ దిచ్చటికింజేను దెంచి గిన్నెలోఁ
గూడుభుజించిపోవు నతి♦ఘోరముదీనియుపద్రవంబిటఁ.

కం॥ అనవిని వీణాకర్ణుఁడు
మనమునఁ దలపోసి యింత ♦ మాత్రంబునకుఁ
వెనుదీయవలదు దీనికి
ననువగు కారణము లేక ♦ యదియుండదిటఁ. 78

కం. అని చూటువులం దెల్పఁగ
విని చూడాకర్ణుఁడిద్ది ♦ విడువక రంధ్రం
బును నొక్క-దాని నిటఁగై
కొని వాసముచేయుచుండె ♦ గూఢముగాగఁ. 79

మ॥ అనుచుఁ నావివరంబుత్రవ్వి యతఁడ ♦ న్యాయంబునఁ
నాధనం
బును సర్వంబుహరింప సత్వము జవం♦బుంబోయి నేనీమహా

వనముం జేరితిఁ బూర్వపుణ్యమున సం♦ప్రాప్తించె నీ తండిర్లా
ఘను లేవేళఁ బరోపకారనిరతుల్ ♦ కాలానుకూలంబుగన్.

ఉ॥ కావున నర్థహీనునకుఁ ♦ గాఁగలకార్య మొకండు లేదు; నీ
భావమపారనిర్మలక ♦ పారసపూరితమంచు నెంచి నీ
సేవలొనర్చుచుం జెలిమి ♦ సేయఁగవచ్చితి నామనోరథం
బేవిధినైనఁ దీర్పుమని ♦ యెంతయు వేడె నమస్కరించుచున్.

ఉ. మంథరుఁ డాహిరణ్యకుని ♦ మాటల కుబ్బుచు లోననీదుసం
బంధము సర్వదానిఖిల ♦ భద్రనిదానము; కూడిమాడి పు
ష్పంధయమట్లు భక్తిరస ♦ సారమరందముఁ గ్రోలుచున్ దినా
ళింధృతిఁ బుచ్చుచుందమవ ♦ లీల నిఁకేటికిఁ ? జింతనీమదిన్.

ఉ॥ భంగములేక కష్టములఁ ♦ బొల్గొనుచుం దనరారునట్టి స
త్సంగతికంటె లోకమున ♦ సత్కుశలంబు మఱేమి లేదు నీ
వెంగలిపాటుమాని మది ♦ వేడ్కవహింపుము లోనఁ జింత లె
ల్లంగుదియించి ముప్పొరము ♦ లౌల్యము లేకిటనుందమీగతిన్.

కం॥ అతిసంచయేచ్ఛతగదని
మతిమంతులు చెప్పుచుందు ♦ మహితసుగుణ ! యీ
స్థితిఁ బూని నక్కయొక్కటి
వెతలంగని సమసెదాని ♦ వినుమని పలికెన్. 84

—♦ జంబుకము కథ ♦—

గీ॥ కలదు మేదినిఁ గల్యాణ ♦ కటకమనెడు
పట్టణంబొండు; తత్పురి ♦ భైరవుఁడను

బోయ డొక్కరుడుండె నే ♦ చాయనైన
నతిభయాకృతి రెండవ ♦ యముడనంగ. 85

శా॥ వాడుగ్రాటవికొక్కరోజున ధను ♦ ర్బాణంబులంబూని వే
టాడంబోయిమృగంబు నేసియధికా♦యాసంబునంబోవుచుం
దోడందానడగొండఁబోలు కిరినం♦దుంజూచి మోదంబునన్
లేడిందింపి మహాశరంబు నొకదా♦నిన్ వేసె గంపింపఁగన్.

ఉ॥ అంతటఁ గోపసంభరిత ♦ మై శరవేదన ఘుర్ఘురించుచుం
జెంతకువచ్చిపోత్రికడు ♦ చేవఁగిరాతునిఁగొట్టఁ గొమ్ముతో
నెంతయుఁబోలుచున్ విడిచె ♦ నేటునఁ బ్రాణము
లాఖలుండు మూ
లాంతమహీరుహంబువలె♦నాగహనావనిఁగూలి చెచ్చెరన్.

ఉ॥ త్రాణఁదొరంగి యాతని ఖ♦రప్రదరంబునదంష్ట్రికూలితాఁ
బ్రాణములంద్యజించె నొక♦పాముటవారల కాళ్ళక్రింద ని
ర్వాణముఁ జెందె నంతనొక♦వంచకమచ్చుటి కేగుదెంచి సం
శ్రేణిగఁ గ్రిందఁగూలిన స ♦ రీసృపపోత్రి కిరాతవర్గమున్.

మ॥ చెలువారంగని పుష్కలంబుగలభిం♦చెన్ భోజనంబంచుఁ జిం
తిలెనీనై ఖరిమూఁడుమాసములకీ♦దేహంబులుంజొలుఁ గొం
దలమందంబనియేమి? దేవుఁడెటనై ♦నంగాని భాగ్యంబులం
గలుగంజేయునదృష్టవంతులకు నె♦క్కాలంబునంజూచినన్.

సీ॥ అనుచు నాకొకమాస ♦ మున కీఖలుని మాంస
ఖండములుసరిపోవు ♦ రెండుమాస

ముల కీకిరికురంగ ♦ ములుఁజోలు నొకవాస
రమున కీ ఘోరస ♦ ర్పంబుజోలుఁ
దోలియాకలిని నిప్పు ♦ డల వింటినారితో
నణఁచివై తునటంచు ♦ నాత్మఁదలఁచి
గొనయంబుచెంతకుఁ ♦ జేనుదెంచి దానినిఁ
బంటనొక్కిన బెట్టు ♦ వదలి తనదు

గీ॥ బొమ్మనందాఁక నాపెట్టు ♦ సొమ్మసిల్లి
ధరణిపైఁగూలి విలవిల ♦ తన్నుకొనుచు
జంబుకముచచ్చెఁ గాన లో ♦ భంబు దెట్టి
వారికైననుఁ దుదకు జీ ♦ వములఁదీయు. 90

చ॥ అనివచియింప నందఁలకు ♦ నద్భుతమొంది హిరణ్యకుండు నీ
ఘనసుగుణంబులంబొగడఁ ♦ గానిఁక నాతరమా నె? యిట్టి నీ
జననమె ధన్యమైవెలయు ♦ త్వామనుజ స్తవనార్హ సాధుజీ
వనమున కెద్దితుల్యమగుఁ? ♦ బావనధర్మములాలకింతిక.

వ॥ ఇట్లు హిరణ్యకుం డమందానందకందళితహృదయారవిం
దుండై మంథరునిశ్లాఘింపుచు జాయమానకరుణాకటాక్షవీక్ష
ణంబులకు సంతసించె. పిమ్మట వారుమువ్వురు సరససల్లా
పంబుల యథేచ్ఛావిహారంబులఁ గాలంబుఁబుచ్చుచుండ
నొకనాఁడు.— 92

ఉ॥ వెంగలివేటకాఁడొకఁడు ♦ వింటశరంబునమర్చి వెంటరా
జెంగెల గజ్జెలున్మెడకుఁ ♦ జెక్కదనంబుఘటింప నిందునుం
డంగనిపెట్టి జీవముల ♦ డంచునతండని సోలిపోయి చి
త్రాంగుఁడునాఁగురంగముభ ♦ యంపడివచ్చెనువారిచెంతకుక.

ఉ॥ వచ్చినతత్కురంగము న ♦ పారదయామతి నాదరించి నీ
విచ్చటికేగుదేరఁ బని ♦ యేమని కూర్మముపృచ్ఛ సేయనో
సచ్చరితాగ్రగణ్యా! ననుఁ♦జంపఁగి రాతుఁడు వెంటరా వనిం
జొచ్చిభయంబుతో నిటకు♦పోలుచువచ్చితినన్నుఁగావుమీా.

గీ॥ సర్వదానవ్రతంబులు ♦ సర్వయాగ
ములును శరణాగతత్రాణ ♦ మునకు సరిమె?
కాన శరణాగతుని వీడఁ ♦ గా ఘటిల్లు
పాపమునకంటె వేఱు పా ♦ పంబుగలదె? 95

మ॥ అనుచుర్ద్రమొక్కలోనర్చుచుర్మిగులఁ జి♦త్రాంగుండు నిల్వంగ వెం
టనె కూర్మంబదిచూచినీవుభయ మొం♦దంగారణంబేమి? స
జ్జనసాంగత్య మపేక్షణీయ మతిపూ♦జ్యంబంచుధర్మజ్ఞు లెం
దునవాక్రుచ్చిరి కాన నీచెలిమి సం♦తోషంబుమాకీయెడర్.

మ॥ అనిచిత్రాంగునిఁ జేరఁదీసి కరుణా ♦ వ్యాపారమేపార దా
నినినోదార్చి భయంబుఁబాపి సఖుఁడా!♦నీదివ్యచారిత్రమున్
వినుపింపందగునంచుమంథరుఁడనర్ ♦ వేడ్కన్ మృగంబంతటం
దనచారిత్రముసర్వముందెలిపె యా♦థార్థ్యంబువాటిల్లగర్.

వ॥ అంతట హిరణ్యక లఘుపతనక మంథరచిత్రాంగులొకరి యిక్కట్లు కొకరు పాల్గొని మొన లేని మైత్రిఁ గావించుకొని కాలంబుఁ బుచ్చుచుండిరని విష్ణుశర్మ రాజపుత్రులకుం దెలిపె. 98

## —• ఆశ్వాసాంతము •—

కం॥ హరకోదండవిభంజన !
ఖరవిక్రమ నిఖలదైత్య ♦ ఖండన ! ధరణీ
ధరకులభూషణ ! విమల
స్థిరతరసత్కీర్తిసోమ ! ♦ సీతారామా. 99

మాలిని॥ సకలవిబుధమాన్యా ♦ సత్యమార్గానుగమ్యా
వికచవనజనేత్రా ♦ విశ్వరూపైకగాత్రా
సుకవినికరగేయా ♦ శుద్ధచిత్తానుమేయా
ప్రకటితగుణశాలీ ♦ భక్తసంత్రాణశీలీ 100

## —• గద్య •—

శ్రీరామచంద్రకరుణాసమాసాదితకవితాచాతుర్యకాశ్యప
గోత్రోద్భవమాదిరాజు వంశపయఃపారావారరాకా
సుధాకరాబ్బరాజామాత్యపుత్రజగ్గమాంబా
గర్భశుక్తిముక్తాఫలరఘునాధామాత్య
కవిప్రణీతంబగునీతికథామంజరియను
మహాప్రబంధమున
ప్రథమాశ్వాసము
సంపూర్ణము.

శ్రీరస్తు.

శ్రీరామాయ నమః.

# నీతికథామంజరి

## ద్వితీయాశ్వాసము

శ్రీజనకతనూజావ
క్షోజాంకితఘనపటీర ♦ కుంకుమరస వి
భ్రాజితవక్షస్స్థలల! పరి
రాజితవరకీర్తిసాంద్ర! ♦ రామనరేంద్రా! 1

వ॥ అవధరింపుము. విష్ణుశర్మ మిత్రలాభంబను తంత్రంబు రాజపుత్రులకు నీతిదాయకంబుగ వక్కాణింప సంతసించి వారు— 2

ఉ॥ పిమ్మటవిష్ణుశర్మఁ బుధి♦వీపతి పుత్రులుగాంచి స్వామి!మో
దమ్మున మిత్రలాభమను♦తంత్రమువింటిమి; మాకు మిత్రభే
దమ్మనుతంత్ర మంచితవి♦ధానముననర్ వినుపింపుమింక శ్రో
త్రమ్ములకుంబ్రియంబుగ సు♦ధారసపానముకై వడిన్ వడిన్.

చ॥ అనవిని విష్ణుశర్మ మను ♦ జాధిపపుత్రులఁగాంచి శ్రద్ధతో
వినుఁడిఁక మిత్రభేదమును♦వీనులవిందుగఁ దెల్పెదన్ సదా
వనమున మున్న సింహవృష ♦ భంబులు గూరిమినుంటఁ
గాంచి రెం
టినివిడదీసి భేదము ఘు♦టించి సృగాలమొకండు రెంటికిన్.

కం॥ పిమ్మట సింహముచే వృష
భమ్మును జంపించె మీర ♦ వార్యప్రియభా
వమ్ములఁదెల్పెద వినుమని
సమ్మోదముతోడఁ జెప్ప ♦ సాగెనతండున్. 5

సీ॥ దక్షిణాపథమందు ♦ రత్నావతిపురంబు
కలదొకండందు వి ♦ ఖ్యాతిగలిగి
వర్ధమానుండు నా ♦ సార్థవాహుఁడొకండు
సిరులతో వాసంబుఁ ♦ జేయుచుండుఁ
దనకంటెఘనులైన ♦ తనబాంధవులఁ జూచి
వారికంటెధనం బ ♦ వార్యవిధులఁ
గూడఁబెట్టఁదలంచి ♦ గొన్ని మేల్సరకులు
వారువంబులమీద ♦ బండ్లమీద

ఆ॥ వె॥ వేసడములమీద ♦ వేయించి కంచర
మొండు సిద్ధపఱచి ♦ మెండుబలము
నంది పేరుగన్న ♦ నందక సంజీవ
క వృషభముల దానిఁ ♦ గట్టిమొక్కి- 6

కం॥ పరివారముతోఁ దా ను
 త్తరదేశంబునకుఁబోయె ♦ ధాత్రీశుఁడర్థ
 బురమునఁగలిగిన వర్తక
 వరులెల్లరుఁ జింతలంది ♦ వర్తింపంగన్. 7

వ॥ ఇవ్విధంబున వెడలి కడు దూరంబుఁగడిచి సుదుర్గంబను శైలంబుచెంగటం గల కాననాంతరమునఁ బోవుచుండ సంజీవకంబు శకటంబు లాగలేక లాగుచు జోఱి మోకాలు విఱుగంబడియె. అంతట నావర్తకుండు సమీపగ్రామంబున కరిగి పోతరించి లావుగల యొకనఱ్ఱువిలిచి తెచ్చి శకటంబునకు గట్టించికొని సంజీవకంబు నా వనాంతరంబున విడిచి సాగిపోయె. పిదప నా కాటియం దా వృషభరాజంబు కొన్నాళ్ళకుం జేకఱఁబడి విచ్చలవిడి నరణ్యంబున సంచరించుచుఁ బచ్చికమేఁత కడుపార దొరకుటంబట్టి పోతరించి యొకనాడు శైలగుహాంతరంబులు మాఱుమ్రోగ గఱిల్లని అంకెవైచె—

గీ॥ అందు బింగళకాఖ్య పం ♦ చాననంబు
 కలదొకండది సర్వమృ ♦ గాల లెక్క
 సేయ కిచ్చకువచ్చిన ♦ చాయ సంచ
 రించుచు విశేషదాహంబుఁ ♦ గాంచి నాడు. 9

చ॥ యమునకు నీటికై వెడలి♦యావృషభారవమాలకించి డెందమున భయంబుదోప నిటు ♦ దారుణభీకరభూరిమేఘనాదముల నిరాకరించు నిన ♦ దంబుజనింపఁగనేల ? దీనికిన్ భ్రమగలుగందొడంగెనని♦రాపడినిల్చె విచారమొందుచున్

కం॥ కలవటఁ గరటకదమనక
ములను సృగాలములు రెండు ♦ ముచ్చటల్లం బ్రౌ
ఢ్దులుబుచ్చుచుఁ గరటకుఁ డ
ర్మిలి నా దమనకునిఁజూచి ♦ మించివచించెన్. 11

చ॥ ఇదివరకీయరణ్యమున ♦ నిట్టి భయంకర నిక్వణంబు వి
న్నదియె? మహాద్భుతంబు; యము ♦ నానది కేగుమృగాధి నాయకుం
డదివిని యిట్టురాపడి భ ♦ యంబుననిల్చినవాఁడుఁగాన ని
య్యది మనబోంట్ల కేయెడ భ♦యం బొనగూర్చుటలో విచిత్రమే. 12

వ॥ అనిన దమనకుండాకర్ణించి యింతమాత్రమునకు భయభ్రాంతులగుట ధీరులకు లక్షణంబుగాదు. కావున నిట్టితఱి మనము మంత్రిపుత్రులమై యుండి యొప్పరికించుట పాడిగాదు. డాయంబోయి మనరాజుగారిభీతి మాన్పింత మనఁ గరటకుండు దమనకుంజూచి దమనకా! కొన్నాళ్ళకుముందు వర్తకుండొకండు కంచరం బీడువఁజాలక యీడిగిలంబడిన బక్కనల్లు నొక్కదానినిం బ్రయాణత్వరం బట్టి యికాంతారమధ్యంబున విడిచి చనియె. అయ్యది యీకాటిలో గడ్డిమేసి పోతరించి యచ్చటచ్చట నఱ్ఱాడగాఁ జూచితి. మన మాకర్ణించినది దాని అంకెగాని వేఱొండు గాదు. కావున నాతని భీతిమాన్పుట మనకేల? ఆతనివలనఁ బడ్డపాట్లకు మేఱగలదె? ప్రాప్తలాభంబునకు సంతుష్టిం

జెందువాఁడు సుఖించును. జోలిమాలినపని మనకేల? అట్టికార్యంబున కుపక్రమించినవాఁడు మేకుంబెరికిన మరట-టంబుచందంబున హానింజెందు నీకాకథ చెప్పెద వినుమని యిట్లనియె— 13

## —♦ వానరముకథ ♦—

సీ॥ మగధదేశమునందు ♦ వగలతో మితిమీఱు
నరిదుర్గమను పురం ♦ బలరుచుండె
నాపురంబున నైభ ♦ వోపేతుఁడై సదా
శుభదత్తుఁడనెడి వై ♦ శ్యుండు గలఁడు
పుత్రహీనుండు కా ♦ వున నతండాత్మవి
త్తముఁ దటాకాది కా ♦ ర్యములకెల్ల
వ్యయమొనర్చుచు జీర్ణ ♦ మైయుండు నొకదేవ
ళంబుఁ గన్గొని యాపు ♦ రంబులోని

గీ. కారువులఁబిల్చి తగిన సం ♦ భారవేత
నముల నియమించి యాదేవ ♦ ళము విశేష
వైభవంబులతోఁ గట్ట ♦ వలయు ననుచు
నంతవారి నియోగించె ♦ నధికభక్తి. 14

సీ. అటుమీఁదవారు దే ♦ వాలయంబును గట్టు
చుండఁగా సూత్రధా ♦ రుండు చేవ
దూలంబు అంపంబు ♦ తోడఁ గోయించుచో
నది ప్రీలిపోవఁ దా ♦ నచ్చుటచట

ప్రమాని మేకులుగొట్టి ♦ మధ్యాహ్న భోజనా
ర్థము కూలివాండ్రును ♦ దాను బోయె
నపుడుఁ జెంగటి భూరు ♦ హములందుఁ దిరుగు శా
ఖా మృగంబులు దాని ♦ కడకువచ్చి
గీ॥ గోపురంబులు ప్రాఁకుచుఁ ♦ గొమ్మలంటి
కాళ్ళతోఁబట్టి తలక్రిందు ♦ గాఁగ వ్రేలు
చుఁ బెనుగొమ్మలు పట్టి యూ ♦ చుచుఁ గరములఁ
గూరుచుండి పరులు వీపు ♦ గీరుకొనుచు. 15

ఉ॥ క్రుక్కుచు మేనిపేలనులు ♦ గొట్టుచుఁబండ్లిగిలించుచున్ సదా
నిక్కుచు వెక్కిరించుచు న ♦ నేకవిధంబులఁ బోరుచుండ నం
దొక్క ప్లవంగవృద్ధమధి ♦ కోద్ధతి దూలముడాసి దానిపై
నెక్కి విహారమున్ సలుప ♦ నెంచుచు ముష్కము దాని సందునన్.

ఉ. వ్రేలఁగఁ గూరుచుండి బిగ ♦ వేసిన మేకును రెండుచేతులం
జాల బలంబునం బెఱికి ♦ చేయ్యన దానిబిలంబు లోపలన్
గ్రాలెడిముష్కమల్లైనలు ♦ గంజరణంబులఁదన్నుకొంచుఁదా
ఘోలుచుఁ బ్రాణముల్విడిచె ♦ రోదననాదము బోరుకొల్పఁగన్.

వ॥ కావున జోలిమాలిన కార్యంబునకుం బోరాదు. ఐనను మన మాతని భృత్యపదంబున లేము. స్వామి హితాహిత విచారము వారిదికాని మనకా యధికార మిసుమంతయైనను లేదు. పరాధికారము పైనవేసికొన్న వెంగలి మోండ్ర వెట్టి దండఘాతంబునఁ బ్రాణంబులు గోల్పోయిన రాసభంబు చందంబున నాశనమొందును. నీకాకథ వక్కాణించెద సావధానచిత్తుండవై వినుమని యిట్లనియె. 18

ఉ॥ వచ్చినతత్కరంగము న ♦ పారదయామతి నాదరించి నీ
విచ్చటికేగుదేరఁ బని ♦ యేమని కూర్మముపృచ్ఛసేయనో
సచ్చరితాగ్రగణ్య! ననుఁ♦జంపఁగిరాతుఁడు వెంటరా వనిం
జొచ్చిభయంబుతో నిటకు♦సోలుచువచ్చితినన్నుఁగావుమీ.

గీ॥ సర్వదానవ్రతంబులు ♦ సర్వయాగ
ములును శరణాగతత్రాణ ♦ మునకు సరియె?
కాన శరణాగతుని వీడఁ ♦ గా ఘటిల్లు
పాపమునకంటె వేఱు పా ♦ పంబుగలదె? 95

మ॥ అనుచుఁ గ్రొమ్ముక్కలొనర్చుచుఁ మిగులఁ జి♦త్రాంగుండు నిల్వంగ వెం
టనె కూర్మంబది చూచినీవుభయమొం♦దంగారణంబేమి? స
జ్జనసాంగత్య మపేక్షణీయ మతిపూ♦జ్యంబంచుధర్మజ్ఞు లెం
దునవాక్రుచ్చిరి కాన నీచెలిమి సం♦తోషంబుమాకీయెడన్.

మ॥ అనిచిత్రాంగునిఁ జేరఁదీసి కరుణా ♦ వ్యాపారమేపార దా
నినినోదార్చి భయంబుఁబాపి సఖుఁడా!♦నీదివ్యచారిత్రమున్
వినుపింపందగునంచుమంథరుఁడనన్♦వేడ్కన్ మృగంబంతటం
దనచారిత్రముసర్వముందెలిపె యా♦థార్థ్యంబువాటిల్లగన్.

వ॥ అంతట హిరణ్యక లఘుపతనక మంధరచిత్రాంగులొకరి యొక్కట్ల కొకరు పాల్గొని మొనలేని మైత్రిఁ గావించుకొని కాలంబుఁ బుచ్చుచుండిరని విష్ణుశర్మ రాజపుత్రులకుం దెలిపె. 98

## — ఆశ్వాసాంతము —

కం॥ హరకోదండవిభంజన !
ఖరవిక్రమ నిఖలదైత్య ♦ ఖండన ! ధరణీ
ధరకులభూషణ ! విమల
స్థిరతరసత్కీర్తిసోమ ! ♦ సీతారామా. 99

మాలిని॥ సకలవిబుధమాన్యా ♦ సత్యమార్గానుగమ్యా
వికచవనజనేత్రా ♦ విశ్వరూపైకగాత్రా
సుకవినికరగేయా ♦ శుద్ధచిత్తానుమేయా
ప్రకటితగుణశాలీ ♦ భక్తసంత్రాణశీలీ 100

## — గద్య —

శ్రీరామచంద్రకరుణాసమాసాదితకవితాచాతుర్యకాశ్యప
గోత్రోద్భవమాదిరాజు వంశపయఃపారావారరాకా
సుధాకరాబ్బరాజామాత్యపుత్రజగ్గమాంబా
గర్భశుక్తిముక్తాఫలరఘునాథామాత్య
కవిప్రణీతంబగునీతికథామంజరియను
మహాప్రబంధమున
ప్రథమాశ్వాసము
సంపూర్ణము.

---

శ్రీరస్తు.

శ్రీరామాయ నమః.

# నీతికథామంజరి

## ద్వితీయాశ్వాసము

శ్రీ జనకతనూజావ
క్షోజాంకితఘనపటీర ♦ కుంకుమరస వి
భ్రాజితవక్షస్స్థల! పరి
రాజితవరకీర్తిసాంద్ర! ♦ రామనరేంద్రా! 1

వ॥ అవధరింపుము. విష్ణుశర్మ మిత్రలాభంబను తంత్రంబు రాజపుత్రులకు నీతిదాయకంబుగ వక్కాణింప సంతసించి వారు— 2

ఉ॥ పిమ్మటవిష్ణుశర్మఁ బృథి♦వీపతి పుత్రులుగాంచి స్వామి! మో
దమ్మున మిత్రలాభమను♦తంత్రమువింటిమి; మాకు మిత్రభే
దమ్మనుతంత్ర మంచితవి♦ధానమునన్ వినుపింపుమింక శ్రో
త్రమ్ములకుంబ్రియంబుగ సు♦ధారసపానముకైవడిన్ వడిన్.

చ॥ అనవిని విష్ణుశర్మ మను ♦ జాధిపపుత్రులఁగాంచి శ్రద్ధతోఁ
విను(డిఁక మిత్రభేదమును♦వీనులవిందుగఁ దెల్పెదన్ సదా
వనమున మున్న సింహవృష ♦ భంబులు గూరిమినుంటఁ
గాంచి రెం
టినివిడదీసి భేదము ఘ♦టించి సృగాలమొకండు రెంటికిన్.

కం॥ పిమ్మట సింహముచే వృష
భమ్మును జంపించె మీఁర ♦ వార్యప్రియభా
వమ్ములఁదెల్పెద వినుమని
సమ్మోదముతోడఁజెప్ప ♦ సాగెనతండర్న్. 5

సీ॥ దక్షిణాపథమందు ♦ రక్షావతిపురంబు
కలదొకండందు వి ♦ ఖ్యాతిగలిగి
వర్థమానుండు నా ♦ సార్థవాహుఁడొకండు
సిరులతోఁవాసంబుఁ ♦ జేయుచుండుఁ
దనకంటెఘనులైన ♦ తనబాంధవులఁ జూచి
వారికంటెధనం బ ♦ వార్యవిధులఁ
గూడఁబెట్టఁదలంచి ♦ గొన్ని మేల్సరకులు
వారువంబులమీఁద ♦ బండ్లమీఁద

ఆ॥ వె॥ వేసడములమీఁద ♦ వేయించి కంచర
మొండు సిద్ధపఱచి ♦ మెండుబలము
నంది పేరుగన్న ♦ నందక సంజీవ
క వృషభముల దానిఁ ♦ గట్టిమొకెఁ. , 6

కం॥ పరివారముతోఁ దా ను
త్తరదేశంబునకుఁబోయె ♦ ధాత్రీసుఁడనర్
బురమునఁగలిగిన వర్తక
వరులెల్లరుఁ జింతలంది ♦ వర్తింపంగన్. 7

వ॥ ఇవ్విధంబున వెడలి కడు దూరంబుఁగడిచి సుదుర్గంబను శైలంబుచెంగటం గల కాననాంతరమునఁ బోవుచుండ సంజీవకంబు శకటంబు లాగలేక లాగుచు జోటి మోకాలు విఱుగంబడియె. అంతట నావర్తకుండు సమీపగ్రామంబున కరిగి పోతరించి లావుగల యొకనజ్జవిలిచి తెచ్చి శకటంబునకు గట్టించికొని సంజీవకంబు నా వనాంతరంబున విడిచి సాగిపోయె. పిదప నా కాటియం దా వృషభరాజంబు కొన్నాళ్ళకుం జికటఁబడి విచ్చలవిడి నరణ్యంబున సంచరించుచుఁ బచ్చికమేఁత కడుపార దొరకుటంబట్టి పోతరించి యొకనాడు శైలగుహాంతరంబులు మాఱుమ్రోగ గణిల్లని అంకెవైచె—

గీ॥ అందు బింగళకాఖ్య పం ♦ చాననంబు
కలదొకండది సర్వమృ ♦ గాల లెక్క
సేయ కిచ్చకువచ్చిన ♦ చాయ సంచ
రించుచు విశేషదానాంబుఁ ♦ గాంచి నాడు. 9

చ॥ యమునకు నీటికై వెడలి♦యావృషభారవమాలకించి డెందమున భయంబుదోప నిటు ♦ దారుణభీకరభూరిమేఘనాదముల నిరాకరించు నిన ♦ దంబుజనింపఁగ నేల ? దీనికిన్ భ్రమగలుగందొడంగెనని♦రాపడినిల్చె విచారమొందుచున్

కం॥ కలవటఁ గరటకదమనక
ములను సృగాలములురెండు ♦ ముచ్చట్లం బ్రొ
ద్దులుబుచ్చుచుఁ గరటకుఁ డ
ర్మిలి నా దమనకునిఁజూచి ♦ మించివచించెన్. 11

చ॥ ఇదివరకీయరణ్యమున ♦ నిట్టి భయంకర నిక్వణంబు వి
న్నదియె ? మహాద్భుతంబు; యము ♦ నానది కేగుమృగాధి నాయకుం
డదివిని యిట్టురాపడి భ ♦ యంబుననిల్చినవాఁడుఁగాన ని
య్యది మనబోంట్లకేయెడ భ♦యం బొనగూర్చుటలో విచిత్రమే. 12

వ॥ అనిన దమనకుండాకర్ణించి యింతమాత్రమునకు భయభ్రాంతులగుట ధీరులకు లక్షణంబుగాదు. కావున నిట్టితఱి మనము మంత్రిపుత్రులమై యుండి యొప్పరికించుట పాడిగాదు. డాయంబోయి మనరాజుగారిభీతి మాన్పింతమనఁ గరటకుండు దమనకుంజూచి దమనకా! కొన్నాళ్ళకుముందు వర్తకుండొకండు కంచరం బీడువఁజాలక యీడిగిలంబడిన బక్కనల్లి నొక్కదానినిం బ్రయాణత్వరంబట్టి యికాంతారమధ్యంబున విడిచి చనియె. అయ్యది యీకాటిలో గడ్డిమేసి పోతరించి యచ్చటచ్చట నర్త్రాడగాఁ జూచితి. మన మాకర్ణించినది దాని అంకెగాని వేఱొండు గాదు. కావున నాతని భీతిమాన్పుట మనకేల ? ఆతనివలనఁ బడ్డపాట్లకు మేలుగలదె ? ప్రాప్తలాభంబునకు సంతుష్టిం

జెందువాఁడు సుఖించును. జోలిమాలినపని మనకేల? అట్టికార్యంబున కుపక్రమించినవాఁడు మేకుంబెరికిన మర్కటంబుచందంబున హానిం జెందు నీకాకథ చెప్పెద వినుమని యిట్లనియె— 13

## —♦ వానరముకథ ♦—

సీ॥ మగధదేశమునందు ♦ వగలతో మితిమీఱు
నరిదుర్గమను పురం ♦ బలరుచుండె
నాపురంబున వైభ ♦ వోపేతుఁడై సదా
శుభదత్తుఁడనెడి వై ♦ శ్యుండు గలఁడు
పుత్రహీనుండు కా ♦ వున నతండాత్మవి
త్తముఁ దటాకాది కా ♦ ర్యములకెల్ల
వ్యయమొనర్చుచు జీర్ణ ♦ మైయుండు నొకదేవ
ళంబుఁ గన్గొని యాపు ♦ రంబులోని

గీ. కారువులఁబిల్చి తగిన సం ♦ భారవేత
నముల నియమించి యీదేవ ♦ ళము విశేష
వైభవంబులతోఁ గట్ట ♦ వలయు ననుచు
నంతవారి నియోగించె ♦ నధికభక్తి. 14

సీ. అటుమీదవారు దే ♦ వాలయంబును గట్టు
చుండఁగా సూత్రధా ♦ రుండు చేవ
దూలంబు అంపంబు ♦ తోడఁ గోయించుచో
నది ప్రీలిపోవఁ దా ♦ నచ్చటచట

ద్రమాని మేకులుగొట్టి ♦ మధ్యాహ్న భోజనా
ర్థము కూలివాండ్రును ♦ దానుఁబోయె
నపుడుఁ జెంగటి భూరు ♦ హములందుఁ దిరుగు శా
ఖా మృగంబులు దాని ♦ కడకువచ్చి

గీ॥ గోపురంబులు ప్రాఁకుచుఁ ♦ గొమ్మలంటి
కాళ్ళతోఁబట్టి తలక్రిందు ♦ గాఁగ వ్రేలు
చుఁ బెనుగొమ్మలు పట్టి యూ ♦ చుచుఁ గరములఁ
గూరుచుండి పకులు వీపు ♦ గీరుకొనుచు. 15

ఉ॥ క్రుక్కుచు మేని పేలను ♦ గొట్టుచుఁ బండ్లిగిలించుచుర్ సదా
నిక్కుచు వెక్కిరించుచు న ♦ నేకవిధంబులఁ బోరుచుండ నం
దొక్క ప్లవంగవృద్ధమతి ♦ కోద్ధతి దూలముడాసి దానిపై
నెక్కి విహారమున్ సలుప ♦ నెంచుచుముష్కముదానిసందునన్.

ఉ. వ్రేలఁగఁ గూరుచుండి బిగ ♦ వేసిన మేకును రెండు చేతులం
జాల బలంబునం బెఱికి ♦ చేయ్యన దానిబిలంబు లోపలన్
గ్రాలెడిముష్కమ ల్లినలు ♦ గంజరణంబులఁదన్నుకొంచుఁదా
నోలుచుఁ బ్రాణముల్విడిచె ♦ రోదననాదముబోరుకొల్పఁగన్.

వ॥ కావున జోలిమాలిన కార్యంబునకుం బోరాదు. ఐనను మన మాతని భృత్యపదంబున లేము. స్వామి హితాహిత విచారము వారిదికాని మనకా యధికార మిసుమంతయైనను లేదు. పరాధికారము పైనవేసికొన్న వెంగలి యొండ్రపెట్టి దండఘూతంబునఁ బ్రాణంబులు గోల్పోయిన రాసభంబు చందంబున నాశనమొందును. నీకాకథ వక్కాణించెద సావధానచిత్తుండవై వినుమని యిట్లనియె. 18

## —• రా స భ ము క థ •—

సీ. ఏపట్టణము మోక్ష • హేతువై నిరతంబు
బహువైభవములతోఁ • బరిఢవిల్లు
నేపట్టణము మహా • పాపంబులణఁగించు
నట్టి గంగాదేవి • కాలయంబు
ఏపట్టణముకోరుక • లిచ్చి భక్తులఁబ్రోచు
నట్టి విశ్వేశున • కాటపట్టు
ఏపట్టణముధాత్రి • నెల్ల పుణ్యస్థలం
బులలోన మిన్నయై • నలరుచుండు

గీ. నట్టి కాశీపురంబున • నధివసించి
యెల్లవారికి ధావక • మల్లుడనెడి
రజకుఁడొకరుండు సుగుణ వి • భ్రాజితుండు
నగుచుఁ దలలోన నాలుక • య న్నట్టులుండు. 19

ఉ॥ వాఁడొకనాడు రేవుకడ • బట్టలుగుంజినమేటిపాటువో
నాడఁగ నిద్రవోయె నపు • డా నడిరాతిరిఁ దోడివారితోఁ
గూడి తదీయగేహమున•కుర్ వెసఁజోరుఁడొకండువచ్చెనా
జోడనెఱింగి కుర్కురము•సందడిసేయక యుండెఁజూచుచుర్.

చ॥ అదికని కాలిబందమున • నాతనివాకిట నిల్చియున్న గా
డిద శునకంబుఁగన్గొని వ • డిర్ యజమానునియింట
ముష్కరుం
డదను నెఱింగిచొచ్చెఁ గన•వా! మఱిమేటికినూరకుందు వి
య్యది తగునాయటంచెనఁగ•నాశునకంబనె దానికిట్టులర్.

ఉ॥ నాపనిచూడ నీకుఁదగు ♦ నా ? తలవాకిలిపీడ కేమెడం
గాపరినై వసించు ననుఁ ♦ గాంచక కూడిడకుండునట్టి యా
పాపిగృహంబుముష్కరుల♦పాలయినంబని యేమినాకు? నా
తాపముఁదీర్పనీకగునె ?♦ధర్మము లేటికి ? నూరకుండుమీ.

ఉ॥ అప్పుడురాసభంబు మది♦నల్కవహించిదురాత్మ! యేలికం
దప్పులువెట్టనిట్టితఱి♦ధర్మమె ? సేవకుఁడుర్వ స్వకృత్యముర్
దప్పినఁదాఁగృతఘ్నుఁడగు♦దైవమెఱుంగడె? నీగుణంబు నే
నిప్పుడెపూని నీపనికి ♦ నేలికనింతట మేలుకొల్పెదర్. 23

చ॥ అనివచియించుచుర్మిగుల♦ నాఖరమంతటనోండ్రవెట్ట వెం
టనె మడివేలుమేల్కొని క♦టా చెడెనిద్రయటంచులేచి దా
నిని నొకదుడ్డుతీసికొని ♦ నిద్దురమత్తునమోదె నద్దియుం
దనయసువుల్దొరంగియమ♦ధామముఁజేరెక్షణంబులోపలర్.

ఉ॥ కానఁ బరాధికారమును ♦ గావలెనంచుఁదలంచునట్టి య
జ్ఞానులు హానిజెందుదురు; ♦ జ్ఞానులు దీనినిఁగోరరింక నీ
బానిసెవృత్తిచేఁ గలుగు ♦ బాధలెఱింగినవాఁడవయ్యు ని
ద్దానికిలోనుగాకుముయ♦థార్థమునమ్ముమునాదుమాటలర్.

వ॥ కావున నిట్టి దుర్వివాదంబేల ? భక్షితావశిష్టంబగు పలలం బెంతయుంగలదు. దానిని భక్షింతము రమ్మన నందులకు దమనకుండు నవ్వి యిట్టి కఠినోక్తుల నామర్మంబుల నొప్పింపకుము. వాని యాకారంబునఁ దదీయహృద్గ తాభిప్రాయంబు నాకవగతంబయ్యె. నే నచ్చటికేగి సఫలీ

కృతకార్యుండనై యేతెంతునని పింగళకునిపాలికింబోయి
సాష్టాంగదండప్రణామంబు లాచరింప మృగేంద్రుండు
చూచి వానికిట్లనియె— 26

సీ॥ దమనకా! నీకు భ ♦ ద్రంబె నిన్నుంజూచి
బహుకాలమాయె మీ ♦ వారలెల్ల
క్షేమమా? యనుచుఁ బ్ర ♦ శ్నింపఁగా దమనకుం
డనియె నీరీతి నో ♦ హరివరేణ్య!
సేమంబెమాకు మీ ♦ చిత్తంబదేమో వి
చారంబునందుండు ♦ చాయఁదోచె
నదియేమొ చెప్పెద ♦ రా యటంచేనికోరఁ
బంచాననంబు భా ♦ షించెనిట్లు

గీ॥ దమనకా! నేడువింటివా? ♦ దైవమాయ
తెలియరాదీమహావన ♦ స్థలమునందు
నుఱుము తెఱఁగున ఘనరావ ♦ మొందువెడలె
దానినాలించి యిట్లుంటిఁ ♦ ద్రాసమూని. 27

చ॥ అనివచియింపనందులకు ♦ నామృగనాథునిఁజూచి వంచకం
బనెనిటులర్ల మహాత్మ! విను ♦ మయ్య వచించెదఁ
గార్యమెప్పుడై
ననుఁదమకించిచేయఁదగు♦నా? యవివేకులమార్గమూని చే
సినఁబఱితెంచుహాని;యిది♦సిద్ధము;ధర్మపథంబుఁజూడుమా.

చ॥ సమయముఁజూచిశాత్రవులఁ♦జంపవలెందమకింపరాదు సం
భ్రమముఁ బరిత్యజించి తగు ♦ పద్ధతి నారయుమింక శబ్దమా

త్రమునకు నిచ్చెలంబొరయ ♦ రాదు భవాదృశు
లిట్టులుంట యు
క్తమె? వినుమయ్య దీనికొక♦గాథవచించెదనంచు నిట్లనెన్.

—♦ జంబుకముకథ ♦—

సీ॥ కాంతారమున జంబు ♦ కంబొండు తొల్లి చా
నెరలేమినెచటఁ గ్రు ♦ మ్మరుచుమిగుల
నాఁకలిబాధచే ♦ నల్లాడుచు ధరిత్రిఁ
గూలినట్టి శతాంగ ♦ కులముఁ, గెడసి
భూధరశ్రేణులఁ ♦ బోలువేదండ తం
డములుఁ, దాఁత్మారుగా ♦ సమసి క్రిందఁ
బడినవారువములుఁ, ♦ గడు మగంటిమి వీర
శయనంబునొందిన ♦ సమరయోధ

గీ॥ జాలములుఁ, గల్గి విజనమై ♦ క్రాలు నొక్క-
పొలికలనిఁగాంచి చెంతకుం ♦ బోయి యొక్క-
ఘోరనిక్వాణమాలించి ♦ గుండెలవియ
నప్పాలముచుట్టు తెప్పలు ♦ విప్పిచూచె. 30

చ॥ గొనకొనిగాలికింగదలు♦కొమ్మలతాకునమ్రోగు దుందుభిం
గని మనమందుగల్గిన వ ♦ గ న్విడనాడుచు దానిచెంతకుం
జని వెసఁజర్మముంగొఱికి♦చేకఁ-(జొరంబడివచ్చి మున్ను దీ
ని నిజమెఱుంగనైతి నిల♦ నిల్క-డమీద నిజంబు వెల్వడున్.

చ॥ అనితలపోయుచుం శవచ♦యంబులనన్నిటిఁబాఱఁజూచి దీ
నిని దొరుగందలంచితిని ♦ నేనవివేకినటంచు మాంసముం
దినిచనెఁగాన సద్దువిని♦నివ్వెఱపొందుటమిమ్ముఁబోంట్ల కెం
దునఁదగునాయటంచుహరి♦తోనవెజంబుకనాథుఁడయ్యెడన్.

చ॥ అనిమరలన్ సృగాల మిపు ♦ డాధ్వనిగల్గినచోటికేగి యం
దునకగుకారణంబరసి ♦ తోడనెవచ్చెదనంచు సింహాశా
సనమున దానిపాదముల ♦ జోడల నావృషభంబుడాసి యి
ట్లనె వినయంబుతో వృషభ ♦ మా! హరిభృత్యుఁడ
నన్నెఱుంగవే. 33

ఉ॥ ఆతఁడు నీసమీాపమున ♦ కంపఁగవచ్చితి నుర్వి నీవన
వ్రాతమునాయధీనమిట ♦ వర్తిలుసత్వములన్నియున్ మదీ
యాతతశాసనంబు తల ♦ యందుధరించివసించుచున్ మహా
ఖ్యాతివహించుఁగాననిఁక ♦ నట్టులనీవువసింపఁగావలెన్. 34

ఉ॥ అంచుఁదనంతఁదానపుడు♦నాడెడుమాటలు నాకుఁజెప్పి పు
త్తెంచినవాఁడు నీవుచేను ♦ దెంచినజోడలతండు లోనఁగా
వించినఱంకెచేనెఱిఁగె ♦ భీతిలఁబోకుము సత్కృపారసో
దంచితుఁడాఘనుండుసమ♦యంబిదివానినిఁజూడరమ్మిఁకన్.

వ॥ అని యొప్పించి ముందుగా మృగేంద్రునిపాలికేతెంచి
స్వామీ! దేవరయానతింబోయి యప్పొలంబు నలుకెలం
కులఁ గాంచివచ్చితి. తద్విశేషంబుల నాలింపుమని
యిట్లనియె— 36

ఉ॥ సహ్యముగానిరావమును ♦ సల్పినవాఁడు సతంబు మీఁకను
గ్రాహ్యుఁడుఁగానికోపమునఁ♦గయ్యమొనర్పఁగఁబట్టినీకు ని
గ్రాహ్యుఁడుగాడు తావకప♦రాక్రమమున్విని భీతిఁజెంది తా
వాహ్యవినమ్రభావమున♦వర్తిలుచుండెమృగేంద్రరాజమా!

ఉ॥ అంచితభూరిభూరుహచ ♦ యంబులఁబట్టి ప్రభంజనుండు భం
జించునుగాని వంచికొను ♦ శీర్షతృణాళిఁబెకల్చునెట్లు; శౌ
ర్యాంచితుడట్లు నిర్గతభ ♦ యాత్ములఁ దన్నెదరించువారి ఖం
డించునుగాని నీచులగ ♦ ణించునె? తాఁగలనైనమేదినిన్.

వ॥ ఇట్టిగుణంబు లేలినవారికి సహజంబులు గావున నాదా
రుణా రావంబుగావించినబలాఢ్యుండు సంజీవకుండనువృష
భేంద్రుండు. దేవరయాస్థానంబున వర్తింపంజాలినఘనుండు.
తమయానతింగొని వాని మీఁసముఖంబునకుం గొని తెత్తు
నని మృగేంద్రుని శాసనంబు శిరంబునందాల్చి సంజీవకుని
కెదురేగి నీయదృష్టంబు కతంబున మృగేంద్రుం డేకాం
తుండై యున్నవాఁడు. దర్శింప సమయంబిదియేయని
తోడికొనివచ్చి పింగళకునిచెంగట నిలువంబెట్ట వృషభంబు
వందనంబు లాచరించె. పిమ్మట మృగేంద్రుండు వానిని
సాదరంబుగ వీక్షించి వృషభరాజమా! నీ గుణంబులు
మా దమనకుండు పెక్కుతెఱంగుల నగ్గింప నాకర్ణించి
యమందానందకందళితహృదయారవిందుండనైతి. భవా
దృశుండగుధీమంతుండస్మదీయాస్థానంబుననుంట పరమ
లాభంబు. కావున నీకు మంత్రిత్వమొసంగితిని. మాకు

మాఱుగ నిఖిలకార్యంబులు నిర్వహించుచు నుండుడని యానతిచ్చి యది దొరంకొని తానును నమాత్యుండును బద్ధసఖ్యంబున వర్తించుచుఁ దక్కంగల పరివారంబులందు నిరాదరుండై యుండె. పిమ్మట దమనకుం డీవిషయంబుల విచారించుచుఁ గరటకుంజూచి యిట్లనియె— 39

ఉ॥ కాఁగలదయ్యె నొకరట • కా! విను నీవచనంబుసత్యమే
నీగతిదూరమెంచ కొన • రించితి నన్నిఁక నీవుదూఱఁగా
రాగలలాభమున్నె? కడు • రాయిడికగ్గుటఁగాని కాన నా
భోగిశయానుభావములఁ•బోలుజనుండొనరించుకార్యముల్.

వ॥ కావున నిట్లు స్వయంకృతాపరాధంబునఁ గీడొందినవాఁడ నేనొక్కరుండ కాను. తొల్లి యాషాఢభూతియనువానిచే నొక్క యతీశ్వరుండును, మేషయుద్ధంబున నొక్కవంచకంబును ధనప్రాణంబులఁ గోల్పోయిరి. నీకాకథ వక్కాణించెద వినుమని యిట్లనియె— 41

## —• ఆ షా ఢ భూ తి క థ •—

సీ॥ క్ష్మాతలంబునదేవ • శర్మాఖ్యుఁడను యతి
బ్రువుఁడర్థపరుఁడొక్క • రుండుగలఁడు
ఆతఁడాశాకృష్ట • చేతస్కుఁడయ్యు వీ
తస్పృహుండుంబోలెఁ • దనియ మాన
వులకు వేదాంతార్థ • ము లుపన్యసించుచు
వానినాలించు య • త్నానమూగి

జనములు దెచ్చియి ♦ చ్చిన విత్తముల ససా
దరసూచకానంద ♦ పరమరుచిర

గీ॥ కాంతిరాజిత విమలాస్య ♦ కమలుఁడగుచుఁ
గాంచి తదనుగ్రహార్థ మా ♦ సించినట్లు
దినదినంబున సేకరిం ♦ చినధనంబుఁ
దుదకు నొకబొంతలోపలఁ ♦ బదిలపఱచి. 42

కం॥ అదికప్పుకొని మహానయ
విదుఁడాతఁడుఁ దిరుగుచుండు ♦ విడువకదానిన్
గదనమున వజ్రకవచము
వదలనివీరుండునా న ♦ వార్యప్రీతిన్. 34

ఉ॥ కర్ణరసాయనంబుగనొ ♦ కానొకరోజున నాతఁడున్ భవో
త్తీర్ణకమోక్షధర్మములఁ♦దెల్పుచునుండఁగనొక్కకాళ సం
పూర్ణముదంబుతోనతని♦బొంతహరింపఁగ వేచియుండి యా
దుర్ణయుడాసిగ్రమొక్కలిడె ♦ దోసిలియొగ్గి మహాత్ముఁడో
యనన్ 44

చ॥ అదికని నీవెవండవు మ ♦ హాత్ముని వైఖరిమాకు భక్తిచే
ముదముఘటించుచుంటివని♦ముచ్చిలిమస్కరిపల్కవంచకుం
డెదవినయంబుతో మునికు♦లేశ్వర! పుణ్యులదర్శనంబు సం
పదలకు నాశ్రయంబని భ♦వాదృశులంగొలువంజెలంగితిన్.

చ॥ అనియొకతాళవృంతమును♦నంది యతివ్రజమౌళి వీచుచుం
డిన యతిచూచి మావలన♦నీకుఁబ్రయోజనమేమి నా నతం

డనవరతంబుఁజూడఁదమ♦యందురహస్యవిధానమొందునా
యనితరసాధ్యమైవెలయు ♦ నర్థమిటంబడయంగ వచ్చితిన్.

ఉ॥ కావున నన్నుశిష్యునిగఁ ♦ గైకొనికూరిమినామనోరథం
బేవిధినైనఁదీర్పుము మ ♦ ఱేదియునేనిఁకనొల్ల సత్యమీ
నావచనంబు నావుడు మ ♦ నంబున మస్కరి సంతసించి నీ
భావమె నాదుభావమని ♦ పల్కనతండతిభక్తిఁజూపుచున్.

వ॥ ఇవ్విధంబున నప్పారాశరివెంట దేశాటనంబు సల్పుచుండె. ఒక్కనాడు మార్గంబున నిర్ద్వరుం బోవుచుండ నా టక్కుదారి సత్వరంబున నా మస్కరిం జేరి నమస్కరించి యిట్లనియె— 48

గీ॥ మనము రాత్రిపరుండిన ♦ మందిరంబు
వారితృణమొండు నామీది ♦ వస్త్రమంటి
వచ్చె నొకపోఁచేనైనను ♦ పరులసొమ్ము
నపహరించిన నతిపాప ♦ మండ్రు బుధులు. 49

ఉ॥ కావున వారిగడ్డిపర ♦ కంగొని వారికినిచ్చివత్తు నీ
తావునఁ గూరుచుండుడని♦తాఁజేనివెన్కకు దానినచ్చటం
బోవిడనాడి కొంతవడిఁ ♦ బుచ్చి రయంబునరా మనంబునం
దా వెఱగందిమస్కరిగ♦తస్ప్రహుఁడీతఁడటంచునెంచుచున్.

గీ॥ కడుముదంబున నాపచ్చె ♦ కానిఁగాంచి
వార్ధకాధిక్యమున హీన ♦ బలుఁడనగుట
నింతమాత్రంబు కప్పుడు ♦ బొంత మోయఁ
జాలకుంటిని దీని నీ ♦ లీలఁదెమ్ము. 51

చ॥ అనితనచేతికీయ నత ♦ డద్భుతహర్ష పరీతచిత్తుఁడై
వినయముతోఁ బ్రసాదమని ♦ వెంటనె తెచ్చుచుఁ
దొంటికంటె హె
చ్చినదగునచ్చికంబాదవు♦చెద్దిముఁజూపుచుసంచరించుచుం
డెను విగతస్పృహుండధిక♦నీతిపరుండని లోకులాడఁగన్.

సీ॥ అకాల-వితాల్పు తా ♦ నొక-వాసరమునఁ
జేనుదెంచుచుంద్రోవ ♦ సమయపరశు
రాముండు కరసహ ♦ స్రంబు ఖండింపఁగా
రక్తప్రభాసంవి ♦ రాజితుండు
విగతతేజుండునై ♦ వెలుఁగు నాకృతవీర్య
సూనుండునుంబోలె ♦ సూర్యుఁడచటఁ
జూపట్టుచుండ న ♦ చ్చోటికిం జెంతను
న్నట్టి తీర్థంబున ♦ కరుగుదెంచి

గీ॥ సంధ్యవార్చుచునుండె మే ♦ షములు రెండు
కట్టెదుట రోషములతో న ♦ గంబులపుడు
మాఱుమోతలు మ్రోయఁగా ♦ దారుణమగు
సంగరంబును డీకొంచు ♦ సలుపుచుండ. 53

గీ॥ మూర్ధములు విచ్చికాలువ ♦ పోల్కి-నడుమఁ
గాఱీపేరిన గట్టి ర ♦ క్తంబుఫేర
వంబాకండు గనుంగొని ♦ పలలఖండ
మనితలంచుచుఁ జెంగటి ♦ కరుగుదెంచి. 54

సీ॥ మహితయుధ్యన్మేష ♦ మధ్యభాగమటంచు
నెంచకద్దాని భ ♦ క్షించుచుండ
నంతలోపల వెన్క ♦ కరుదెంచి వెంట వ
చ్చిన మేషయుగము డీ ♦ కొనుడునడుమఁ
బంచత్వ మొందెనా ♦ వంచకంబయ్యెడ
నాపరివ్రాజకుం ♦ డద్దిచూచి
పలలలోభము ఘోర ♦ వము నిట్టిదశకుఁ దె
చ్చెఁగదా ? కటాయెట్టి ♦ శీలవంతుఁ

గీ॥ డేని లోభగుణంబుచే ♦ హింసనొందు
నని తలంచుచుఁ దత్తీర ♦ మునకువచ్చి
శిష్యునాదారిఁగానక ♦ చింతనొంద
సాగి యాషాఢభూతి యా ♦ షాఢభూతి. 55

చ॥ అని మెలుగెత్తితాఁబిలిచి♦యంతటఁజూచుచుఁ జేయిసంజవె
ల్గునకునుఱుంగు వెట్టుకొని ♦ గుర్తులువానికిఁ జెప్పిబొంతఁ గై
కొనిచేనునిట్టివానిఁగనుఁ ♦ గొంటిరె? మీరనివచ్చుపోవువా
రి నడుగుచుర్వ దిశల్వెదకి♦రిక్థహరుం డితఁడంచు నెంచుచుర్వ.

గీ॥ శిరముపంకించి నిట్టూర్పు ♦ దొలఁగి మేష
సంగరముచే సృగాల మా ♦ షాఢభూతి
వలననేను స్వదోషంబు ♦ వలనఁ జెడితి
మని మనంబునఁదలఁచుచు ♦ నరుగుదెంచె. 57

వ॥ అనిచెప్పినఁ గరటకుం డాకర్ణించి యెట్టి ధీమంతునికైన
నొక్కొక్క కాలంబునఁ బ్రమాదంబు వాటిల్లుట స్వాభావి

కంబు. అందులకుఁ జింతింప లాభంబులేదు. కావున నీ వింక నాచరింపందగిన కార్యంబేమియని ప్రశ్నింప దమనకుం డిట్లనియె. కరటకా! లోకంబున వినాశోన్ముఖకార్యంబుఁ జేకొఱఁబఱచుటకును, భావ్యర్థసంగ్రహంబునకును, ననర్థప్రతీకారంబునకును మంత్రంబే శ్రేయస్కరంబు. కావున నిట్టిసమయంబునఁ బింగళకసంజీవకులకు భేదంబు పుట్టించు నుపాయంబాలోచింపవలయును. ఉపాయంబుచే నెయ్యది శక్యంబగు నయ్యది పరాక్రమంబునకు శక్యంబు గాదు. తొల్లి కాకంబొకం డుపాయంబుచేఁ దనవైరియగు భుజంగంబునుదోరించె నకథ వక్కాణించెద నా కర్ణింపుము. 58

—• కాకభుజంగములకథ •—

కం॥ యమునాతీరంబున విపి-
నమునం దొకమఱ్ఱిచెట్టు ♦ నడుమ నొకకులా
యముఁ గట్టికొనియుద్దా మో
హముతోడం గాకమిథున ♦ మందువసించెన్. 59

కం॥ ఆమఱ్ఱిక్రింది నాకువు
లో మెలఁగుచు సర్పమొండు ♦ లోఁగక కాకం
బే మఱచి దానియండ
స్తోమముఁదిని పోవుచుండుఁ ♦ దోషంబలరన్. 60

ఉ॥ దానికి వాయసంబధిక ♦ దారుణఖేదముతో మనంబునన్
దీని యుపద్రవంబెటులఁ ♦ దీరునటంచుఁ దలంచిచెల్మితో

దానమునల్పు జంబుకము♦దాపునకుం జేనుదెంచి పాముచే
నౌననయంబు చెప్పికొని♦ యంతటసారెకు నంగలార్చినన్.

వ॥ అప్పుడు గోమాయువాత్మమిత్రుండగుకాకంబుంగాంచి
మిత్రమా ! దీనికిం జంతిల్లిన లాభమేమి ? తొల్లి యొక్క
సరోవరంబునం గల మీనంబులనెల్ల భక్షించిన బకంబు
నొక్క కుళీరం బుపాయంబువలన సంహరించె. అట్లు
నీవును నీవైరిం దుదముట్టింపుము. నీ కా చరిత్రంబు
చెప్పెద నాకర్ణింపుమని యిట్లనియె. 62

సీ॥ మును ఘోరబదరికా ♦ వనమందు సారోద
మనుసరోవర మొకం ♦ డలరుచుండు
నటకొక్క కొక్కెర ♦ యరుదెంచి లోచనం
బులు మూసికొని యన్న ♦ ముం ద్యజించి
తపమాచరించెడి ♦ దానివైఖరి నేక
పాదంబుతోడ ని ♦ ల్వంబడియుండ
నొకయెండ్రి కనిదాని ♦ నుత్సాహమునడాసి
యోబకాధీశ ! ని ♦ న్నుగ్గడింపఁ

గీ॥ దరమె? నీవిట్లుక్రశిమంబుఁ ♦ దాల్చుచుండి
చెంతఁబొరాడు చేపల ♦ నుంతయైనఁ
జూడవీయునిక్కయేదియో ♦ శుభముఁగోరి
పూనినమహావ్రతంబు కా ♦ బోలునేమొ ? 63

ఉ॥ నీచరితంబు నాకిపుడు ♦ నేమముతో వినుపింపుమన్న సం
కోచముమానిడెందమునఁ♦గొంగకుళీరముఁగాంచియెండ్రి!నా

వాచిక మీవుపమున ♦ భావన సేసితివింక నీమహా
ధీచతురత్వమెట్టుల ను♦తింపఁదరంబగు మమ్ముఁబోంట్లకున్.

ఉ॥ పుట్టినదొట్టి నాయుదర ♦ భూరితరానల ఘోరకీలలన్
గిట్టిన జంతురాశిఁ బరి ♦ కింపఁగ లెక్కకురావు కానని
ప్పట్టున గట్టిపట్టుదలఁ♦బ్రాణములన్ భరియించుచుంటినా
యట్టిదురాత్ముఁ డిద్ధరణి♦యందుఁగలండె? కుళీరసత్తమా.

సీ॥ ఇట్లుండ నొక్కరో ♦ గీశుండు శిష్యుల
సఖిలధర్మంబుల ♦ నానతిచ్చు
సందర్భముననుదో ♦ షముల కాధారమై
చెలఁగులోభము విస ♦ ర్జింపవలయు
సర్వభూతంబుల ♦ సదయుఁడై వర్తింప
వలయు నియ్యది లేని ♦ వానికఖిల
ధర్మంబులు ననుష్ఠి ♦ తములయ్యు వ్యర్థంబు
లగు జీవనంబు తా ♦ నస్థిరంబు

గీ॥ కాన పురుషుండు మోసపో ♦ క సమయంబు
నట్లెపుచ్చక ధర్మంబు ♦ లాచరింప
వలయునని చెప్ప విన్నట్టి ♦ వాఁడనగుట
నదిమొదలుకొని మతిధర్మ ♦ మందెనిలిచె. 66

కం॥ హింసాకర్మముఁ బాసితిఁ
గంసారిన్ బుద్ధినిలిపి ♦ ఘనతరభక్తిన్
సాంసారికసౌఖ్యంబుల
ధ్వంసంబొనరించి మౌని ♦ వలెనుంటివనిన్. 67

చ॥ అనవుడుఁ జేపలానుడువు♦లబ్బుర మొందుచు నాలకించి ధ
ర్మనిరతుఁడీఘనుండుబక♦మాత్రుఁడుగాడనిడాయఁబోయినీ
ఘనకరుణావలోకనము♦గాడిలితోఁబాలయించి మాపయిన్
మనుపుమటంచు నానతఁడు ♦ మంచిది యుష్మదభీష్ట
మయ్యెడిన్. 68

వ॥ అనిచెప్పి నాటంగోలె మీనంబులతో సఖ్యంబుఁ జేసికొని వర్తించుచుండె. ఇట్లు కొన్నాళ్ళుగడువ నొక్కనాడు వఱువాతఁ దనచెంత కరుదెంచిన మీలంజూచి దీనవదనంబున నిట్లనియె— 69

చ॥ హితునివలెన్ నటించుచు స♦హింపనిచింతలఁ బాష్పవారిపూ
రితనయనద్వయుండయి వి♦రించిలిఖించిన వ్రాత లేరిక
ప్రతిహతముల్గదాయనుచుఁ♦బల్కఁగ మీనములాలకించియీ
వితమగు ఖేదమిట్లనుభ♦వించుట కేమికతంబు? దెల్పుమీ.

సీ॥ అనుచు వక్కాణింప ♦ నాటక్కరిబకంబు
తనమెల్లురాల్పడ ♦ ననియెనిట్లు
తనయదారాదిబం ♦ ధముఁ ద్రెంచికొని మను
ష్యుఁడనై సుఖింపంగఁ ♦ గోరియుండఁ
బ్రారబ్ధమున భవ ♦ ద్బంధంబుసమకూడె
మీకొక్కయిక్కట్టు ♦ సోకునన్న
నుల్లంబుకడుఁ దల్ల ♦ డిల్లుచుండునటంచుఁ
గన్నీరునించి మో ♦ యన్నలార!

గీ॥ జాలరులు కొందరింతకు ♦ క్షణముక్రింద
వచ్చి పరికించి యీ సరో ♦ వరమునింకఁ
గొలఁదినీరింకినను వచ్చి ♦ జలచరములఁ
బట్టుకొని వత్తమనివారు ♦ పల్కిచనిరి. 71

ఉ॥ ఆవచనంబులన్వినిన ♦ యంతనె నాహృదయంబు బ్రద్దలై
పోవఁగ నాటఁగోలె ఘన♦భూరివిషాదముతోఁ జెలంగిరీ
నావుఁసమీనముల్విని మ ♦ నంబునభీతిజనింప మమ్ము నీ
వేవిధినైనఁ బ్రోచుట కి ♦ దేసమయంబని కోరి మ్రొక్కినన్.

ఉ॥ పంబినవేడ్కతోఁబకమ ♦ పాంపణిమోయని పేరుగన్న ని
త్యాంబుసరోవరంబిటకు ♦ నామడలోపలనుండె నందు మి
మ్మింబడనైతుఁగానియొక♦పూటనెచేర్పఁగజాలనంచు మీ
నంబులకెల్లడెందమున ♦ నమ్మికపుట్టవచించిమీఁదటన్. 73

గీ॥ నిత్యమాకొంగవలసి న ♦ న్నింటిమీలఁ
బట్టికొనిపోయి యొకకొండ ♦ బండమీద
నునిచి భక్షించుచుం గొన్ని ♦ దినములకును
దాని నిర్మీనముగఁ జేసెఁ ♦ బూని తెగువ. 74

ఉ॥ అంతటనెండ్రిమిత్రమగు ♦ నాబకరాజముఁగాంచినన్ను దు
ర్దాంతవిపత్సముద్రమును♦దాటఁగఁ జేయుము నా బకంబు నీ
యంతటిమిత్రుర్నిమనుపు ♦ నంతటివాఁడనె? వైననింక నీ
చింతలఁదీర్ప యత్నమును♦చేసెదనంచువచించి నమ్మికన్.

ఉ॥ ఎండ్రినిఁబట్టిచంచువుల ♦ నేర్పడ మీలనుఁదిన్నకొండకున్
గండ్రతనంబునంజేనెడు ♦ గద్దఱిపోకడఁజూచి యెండ్రి లే

వంద్రుజలంబులిస్యోడమ♦దాప్తులు; కావుననన్నుఁ గొంగయీ
తీంద్రపుఁగొండకొమ్మనకి♦దేకొనిపోవుచునుండెని త్తజీ.

గీ॥ లోనఁ గపటంబుగలిగి యీ ♦ మీనములను
బట్టికొనివచ్చి యీకొండ ♦ బండమీఁదఁ
బెట్టుకొనిమ్రింగెఁ గాబోలు? ♦ బేలనైతిఁ
గాదె? తెలియక దీని వా ♦ క్యములునమ్మి. 77

గీ॥ మాయికులయందుఁ దాబుద్ధి ♦ మంతుఁడెపుడుఁ
గాని మాయావినైయుంట ♦ యేనయంబు
కాన గీనిని నేవిధి ♦ నైన మోస
గించి వచ్చినబాధ త ♦ ప్పించుకొందు. 78

వ॥ అని వగచి కర్తవ్యంబాలోచించి యీటక్కరికొక్కెరం
జూచి మందస్మితవదనారవిందంబున నిట్లనియె. 79

చ॥ వెస నిఁక నన్నునీవిటుల ♦ వీరవరేణ్యునిఁబోలె నోటితో
దుసికిలకుండఁబట్టికొని ♦ దూరముపోవఁగలేవు; లేక నే
రసపయిజారినందుదకుఁ♦బ్రాణముదక్కదు; మీఁదనీకెదఱ
వ్యసనముగల్గునీకొకయు♦పాయముఁదెల్పెదనాలకింపుమీ.

గీ॥ సకుఁడ! నీగొంతు నేను ప ♦ ట్టుకొనివత్తుఁ
జెలఁగుగంతవ్యదేశంబుఁ ♦ జేరువరకుఁ
బట్టువిడువను నన్నుఁ గా ♦ పాడునట్టి
భారమంతయు నీది నీ ♦ వాడనయ్య. 81

గీ॥ అనఁగవిని కొంగతావల్లె ♦ యనివచించి
గొంతు నెంౘ్డికఁబట్టించు ♦ కొనినగంబు
పొంతకుంబోయి కాళ్ళూన ♦ బోవునపుడుఁ
దనదుగిట్టలతో దాని ♦ తలనుౘ్రదెంచి. 82

ఉ॥ వచ్చినముప్పుఁదప్పుకొని ♦ ప్రాణములంజెనెఁగాన నీవిటం
బొచ్చెముఁబూని నీపగతు♦పోరణగింపుమటంచు జంబుకం
బచ్చపుఁగూర్మిఁదెల్పవిని♦యాకరటంబుమహారయంబునన్
వచ్చె నిజాలయంబున క♦వార్యనిరంతరధైర్యమూనుచున్.

కం॥ ఘనయమునాతీరంబున
ధనకనకాదులవిలాస ♦ ధామంబనుప
త్తనరాజమొండు రెండవ
దనుజారిపురంబనంగఁ ♦ దనరుచునుండున్. 84

మ॥ కికురింతల్విడి రాజకాంతలచటం ♦ గ్రీడార్థమే తెంచి కా
నకుఁ బుష్పాపచయం బొనర్చి♦శ్రమమోనాడన్ జలక్రీడకై
యొకపద్మాకరముంగనుంగొని♦తదీయోద్దామసౌందర్యకాం
తికి డెందంబున సంతసంబొదువఁ ద ♦ త్తీరప్రదేశంబునన్.

సీ॥ చేరిహారాద్యలం ♦ కారంబులూడ్చి య
కట్కడనుంచి గుబ్బచే ♦ నట్టుగట్టి
చెలఁగు నొండొరుల చె ♦ ట్టలుపట్టుకొనిమంద
గతులనొయ్యారంబు ♦ లతిశయింప

నీరంబులండిగ్గి ♦ వారిశోభాపరి
స్ఫురణంబులంజూచి ♦ చూచియంత
కంటెనాత్మీయాంగ ♦ కాంతులు మెఱయించు
గతిబెళ్కు-చూపులు ♦ కళవళింప

గీ. నులుకుచు విశేషజలకేళి ♦ సల్పుచుండ
నించుబోడియొకతె దోయి ♦ లించిదోయి
లించినీళ్ళెత్తిదానొక్క ♦ చంచలాక్షి
పైనఁజల్లిన మఱల నా ♦ పంకజాక్షి. 86

ఉ॥ మారొక్కనియేది చేల్లుమని ♦ మల్లరపుందనమూని చేల్లనా
కరక్కశవారిధారలకుఁ ♦ గాఱియమొందుచుఁ దాళలేక నీ
కోర్కెలు దీఱెఁగాన ననుఁ♦గొట్టకుమింక నమస్కరింతు నీ
తరక్కమిదేల నీతెఱువు♦ దాకొనమానుమటంచుఁబల్కెనర్. 

ఉ॥ ఆయదియిస్సిరోయిటుల ♦ నంతటిపందవెనా మఱొక్క ప
ద్మాయతనేత్ర కోపమున ♦ దానిఁగనుంగొని జాణవేనినా
చాయకురమ్మ నీవయసు ♦ చూనలఁజూడక చిన్నదానితో
నా యిటుబింకముల్మఱలు ♦ మాయనిపల్కుచుఁదాను నద్ది
యర్. 88

చ॥ తొలఁగక పట్టుఫీడకటఁ♦ దోఁగుచుహస్తసమీరితాంబుధా
రలఁ బురికొల్పి యొండొరుల ♦ రమ్మని హెచ్చుచుమెచ్చుచుర్ మహా
కలకలనాదముల్వెలయఁ ♦ గా జలకేళినొనర్పఁ దోడివా
రలిది సుఖంబె? మీదుసమ♦రంబులుచాలికరండురండనర్.

చ॥ చిఱునగవుల్ముఖాబ్జములఁ ♦ జెన్నలరారఁ బయింటలోన నీ
బ్బరముగ నుబ్బినిక్కువోడు ♦ వన్ బిగిసిబ్బెపుగబ్బిగుబ్బల
త్తఱిఁగడురోజుచున్నిలువఁ ♦ దాలిమితో మఱికొందరుద్ధులై
వరమణిభూషణంబులను ♦ పందెము పెట్టి మహారయంబునన్.

ఉ॥ పారముసేరి పట్టుదలఁ ♦ బాయకయీదుచుఁబోవ నేలమీ
రూరక లేని పంతముల ♦ నూనెద రేయని లాతివారనం
జేరితటంబిటన్ మనలఁ ♦ జేరినవారలకున్ శ్రమంబు దు
ర్వారముగాదెయంచు గెలు ♦ వందగు నేర్పులు పల్కుచున్ వెసన్.

ఉ॥ ముట్టుచుఁ దత్తటంబపుడు ♦ ముట్టనివారిని నవ్వి చేతులం
గొట్టుచు నోడినారనుచు ♦ గుబ్బలఁబొందెడిసామ్యమోర్వలే
కట్టిరథాంగహంసముల ♦ నవ్వలికిన్వెసఁ బాఱఁదోలుచున్
మట్టిమనోజబాణములఁ ♦ బోలుసరోజములం గలంచుచున్.

గీ॥ జలవిహారంబులీగతి ♦ సలుపుచుండఁ
దీరమున మున్నిడిన యలం ♦ కారములను
మణిసరంబొండు ముక్కున ♦ నణఁచిపట్టి
పఱచి యాకాకియటనొక్క ♦ తరువుఁ జేరె. 93

చ॥ కనియదియేమిచిత్రమిది ♦ కాకము రత్నసరంబు నోటితోఁ
గొనిచనెఁజూచినారెయని ♦ కోమలియొక్కతె పల్కనందఱుం
గనుఁగొనిమోములెత్తి వెసఁ ♦ గాకముదామణిహారమామిషం
బనిభ్రమియించెనేమొయని ♦ యాడుచుఁగోపము పెచ్చరిల్లినన్.

సీ॥ తనమెడం దగిలించి ♦ కొని కలఁకలాడఁ బో
యెనటంచు, నీయంద ♦ మునకు హార
మొకటి తకు్కవెయని ♦ మోకమందముగఁ ద్రిప్పి
కరమెత్తి కడునెట్టి ♦ కలవిలచుచుఁ
జేకఁ నిమణిహార ♦ మికాౖకి యెకఁడ
నుండి తానేతెంచె ♦ నో యిచటికి
నెటఁబాఅవైచునో ♦ యిఁక నేరికబ్బునో
యండజంబున కిట్టి ♦ మండనంబు

గీ॥ తోడఁబనియేమి ? దీనికే ♦ దో విశేష
ముండు నద్దాని పరికింప ♦ కుండరాదు
గారణములేకయేదియుం ♦ గానరాదు
నిలుకడలమీాద నైజంబు ♦ తెలియవచ్చు. 95

చ॥ అనుచుఁగలంగి యొండొరులు ♦ నచ్చటముచ్చట లాడు చుండఁగాఁ
గని చెలులందుఁ గొందఱది ♦ కాకమదేదిశఁబట్టిపోవునో
గనుఁగొనుచుండుడంచు నటఁ♦గావలివారలనుంచి సత్వరం
బునఁజేని రాజసేవకుల ♦ పొంత నయంబునఁజెప్పి దీనినిఁ.

గీ॥ అంతవారిచేఁ బ్రేరితు ♦ లగుచు జనుల
వెంటఁదోఁకొనివచ్చి కా ♦ న్పింపఁజేయ
మందగతిఁజేని కాకమా ♦ త్మగృహమునకుఁ
గ్రిందివల్మీకమునవైచెఁ ♦ గినుకఁబూని. 97

చ॥ భటులదికాంచి గట్టిగున ♦ పంబులులోనగుసాధనంబులం
తటఁగొనివచ్చి దానివెసఁ ♦ ద్రవ్వఁగఁజేసిననందునాగము
ద్భటతరదుర్విషానలము ♦ దార్కొన ఘూత్కృతులన్ని
గుడ్పుచుం
బటుతర జిహ్వలార్చుచు స♦వార్యగతింగలువంగవచ్చినన్.

ఉ॥ వారలుగఱ్ఱలంబొడిచి ♦ పన్నగమున్ మడియించి వొటనా
భూరిసరంబుఁ దీసికొని ♦ పోయిరి కాకమునాటఁగోలె దు
ర్వారసుఖంబులంగనె ను♦పాయముచే నెపుడైనధాత్రి సే
కూరనికార్యముల్గలవె?♦కూడునె?యయ్యది లేకయేదియున్.

## —♦ కుందేలుకథ ♦—

వ॥ కావున బుద్ధిబలంబుగలవానికి సర్వంబు సేకూరు. ధీశక్తి రహితున కేదియుం బొసఁగ నేరదు. తొల్లి యొక్క శశకంబు నేర్పునం జేసి యొక్క పంచాస్యంబుం ద్రుంగించె నక్కథ వక్కాణించెద వినుమని యిట్లనియె— 100

సీ॥ మున్నొక్క కాననం ♦ బున సత్త్వసారంబ
నెడు మృగేంద్రంబుండె ♦ నడవిలోనఁ
గలజంతువులనద్ది ♦ పొలియించితినుచుండ
నచటిసత్త్వములెల్ల ♦ నతిభయమున
నొక్కచేక్కటిఁజేరి ♦ పెక్కురీతుల విచా
రించి వాటిలిన బా ♦ రికి నుపాయ
మెదియుఁగానఁగలేక ♦ తుదకుఁ గర్తవ్యాంశ
మొక్కండు పరికించి ♦ మోలికలియఁ

గీ॥ బలికికొని కెండగిలి సింహ ♦ పతినిఁజేరి
వదనముల దీనభావంబు ♦ వఱలదూర
దూరములనిల్చి కడు నమ ♦ స్కారములిడి
వినయముంజూపి యీరీతి ♦ విన్నవించె. 101

ఉ॥ ఓ మృగరాజ ! మామనవి♦నోపికతోవినుమయ్య యుష్మదీ
యామితవిక్రమానల శి ♦ ఖావలికేము భరింపలేక నీ
ప్రేమవరించివచ్చితిమి ♦ వేఱనకింతటినుండి వంతుమై
స్వాములచెంతకంపుదుము ♦ జంతువునొక్కటిఁ
ప్రత్యహంబునన్. 102

ఉ॥ కావునమీరుదానినెఱ♦గాఁగొనిమమ్ములఁబ్రోవఁగావలెన్
నావుడుసంతసించి మృగ♦నాయకుఁడట్లని యానతిచ్చె ద
ద్భావమెఱింగి యంతమృగ♦తండములయ్యెడలోనఁజింతలం
బోవిడనాడితావులకుఁ♦బోయిముదంబునఁబ్రత్యహంబునన్.

గీ॥ ఓలివంతుల కొలఁది నొ ♦ క్కొకమృగముఁ
జేరి సింగంబుచెంతకుఁ ♦ జేర్చుచుండఁ
గడువఁగాఁ గొంతకాల మి ♦ క్కరణిఁ జెవుల
పిల్లినొకదానిని మృగంబు ♦ లెల్లబిలిచి. 104

ఉ॥ ఎల్లిమృగేంద్రుసన్నిధికి ♦ నేగెడువంతిఁకనీదియన్న మూ
ర్ఛిల్లిశశంబుకొంతవడిఁ ♦ జెచ్చెరలేచి మనంబు భీతిచే
ఝల్లుమనంగ నెవ్వరికి♦శక్యమె? దైవకృతంబుదాటఁగాఁ
దొల్లిటికర్మముంబొదిలి♦దూఁకొనుకష్టసుఖంబు లెల్లెడన్.

ఉ॥ కావునభీతిలేక మృగ ♦ కాంతునిఁ ద్రుంపఁగడంగెదన్ మనీ
షావిధినెట్టులైన నిఁక ♦ సారససంభవుఁడాయజుండు నా
కేవిధివ్రాసెమీఁదనటు ♦ లేయగుఁ గొందలమొందుచుండినం
బోవునె వచ్చినట్టివిధి ♦ పుచ్చకకాలము పోయివచ్చెదన్.

చ॥ అనితలపోయుచున్వడలి ♦ యాత్మనుపాయము దోపకుండ న
ల్లనఁజేనుచున్ పథంబునఁగ ♦ లంగమనంబుసహించి కొంతసే
పున కటకేగి తాహరికి ♦ మ్రొక్కె-న; సింగముచూచి జూలుని
క్క- నధికరోషమూని శశ ♦ కంబునకిట్లనెఁ బౌరుషోక్తులన్.

ఉ॥ కుట్టినఁదేలటంద్రు మఱి ♦ కుట్టమిఁగుమ్మరపుర్వటంద్రు నీ
విట్టుల వేళదప్పి యిట ♦ కేటికివచ్చితి వీమృగాళి కి
ప్పట్టునహెచ్చెగర్వ మని ♦ వార్యమదీయబలంబునింక నీ
కట్టెదుటం గనంబఱతుఁ ♦ గాంచుమటంచని లేచెనల్కతోన్.

ఉ॥ అంతటనాశశంబట ♦ మృగాధిపునింగని మ్రొక్కి స్వామి! ర
వ్వంతయు నీదుసేవకుల ♦ యందలి దోసము లేదు లేచి మీ
చెంతకు నేనువచ్చుతఱిఁ ♦ జెచ్చెఱసింహమొకండువచ్చి నే
త్రాంతములందునిప్పులొల ♦ యన్ ననుగాంచివచించెనీగతిన్.

ఉ॥ ఓశశకంబ! మాయెదుట ♦ నుద్భటవృత్తి మత్తేమృగంబు లే
కోశమునందు లోనఁగల ♦ గుండెటువీడి చరింపవౌర! నీ
పాశములన్ నిగిడ్చికొని ♦ పాఱుటమాకె వెఱంగగున్ మదా
దేశముఁద్రోసివేయఁగల ♦ తేజమునీకెటులబ్బెఁ జెప్పుమీ.

సీ॥ అనినిరోధింప నే ♦ నాతనింగాంచి మా
కథిపుండు సత్యసా ♦ రాభిదానుఁ

డను మెకంబులరాయఁ ♦ డలరు నే నవ్వాని
దరికేగుచుంటి నా ♦ తండొకింత
కోపింప లోకమా ♦ కులమాచు వెలయునా
నాతండు మధ్యంది ♦ నాంబుజాప్త
మండలంబుంబోలె ♦ మండుచు నెపుడు లే
నట్టి యబ్బుర మిప్పు ♦ డాలకింప
గీ॥ వలసివచ్చెనటంచుఁ దాఁ ♦ దలను ద్రిప్పి
యీవనంబున మృగముల ♦ కేనెదొరను
గాని నాకంటె దొర వేఱొ ♦ కండు గలఁడె?
యతనినాకింకఁ జూపింపు ♦ మఱఁచివైతు. 111

కం॥ చూపింపవేని కాలుని
దాపునకుఁ నిన్నుఁబంపె ♦ దనటంచుఁ గడుం
గోపించినన్ను నిత్తరి
నీపాలికిఁబంపెనయ్య ♦ నినుఁ గొంపోవన్. 112

గీ॥ దాననాలస్యమయ్యెనా ♦ దానినివిని
మండిపడి సింహమాదుష్టు ♦ మట్టివైతు
నతనిఁజూపింపుమనఁగఁ బం ♦ చాస్యమునకుఁ
దోడఁజూపించె శశమొక్క ♦ పాడుబావి. 113

ఉ॥ ఓమృగసార్వభౌమ! బలి ♦ యుండగు యుష్మదమిత్త్రుఁడిందునం
ద్రామిడిమైవసించెఁదల ♦ వాంచికనుంగొనుమంచు నా మృగ
స్వామిమహోగ్రదృష్టిఁగని ♦ వారినిజప్రతిబింబముగ్ర సం
గ్రామమొనర్చు నన్యమృగ ♦ కాంతుడటంచేని దూఁకి
త్రుంగెడిన్. 114

గీ॥ కాన బుద్ధిబలంబుచే ♦ ఘనబలాఢ్యుఁ
బగతు నెంతటివానిఁ గె ♦ ల్వంగవచ్చు
నట్టివిధమున నాడు కా ♦ ర్యానుకూల
మునకొక యుపాయముండెఁ దా ♦ నినివచింతు. 115

వ॥ తొల్లి కృతాపరాధంబులగుటఁ గాటకపాటకంబులు త్రేనిచే నిష్కాసితంబులయ్యె. త్రేని యనుగ్రహంబు సంపాదింపం గోరి యాజంబుకంబులు సంజీవకు ననుసరించుచున్నవి. మదీయోద్యోగమున కీయుపాయం బనుకూలంబు. పోయి వత్తు సెలవిమ్మని కరటకుఁవీడ్కొని దమనకుండు పింగళకుని చెంత కేతెంచి. 116

ఉ॥ క్రొమ్మొక్కు మొగంబువాల్చికొని ♦ మూఁకతనంబు వహింపఁ
గాంచి తాఁ
గక్కసమొందుచుం దమన ♦ కా! వినుమేటికి నీవు తెల్విలే
కిక్కరణిఁ వసించితివి ♦ హేతువుదెల్పుము నామృగేంద్రుఁడా
నక్కలఱేఁడు తామసము ♦ నఁ ముద మొందుచుఁబల్కె నీ
గతిఁ. 117

కం॥ సంజీవకుండు మీమది
రంజిల్లఁగ నింతదనుక ♦ శ్రద్ధాత్ముండై
భంజించుచు నిట శాత్రవ
పుంజంబుల; నెపుడుఁ గీర్తి ♦ పూరితుఁడగుచున్. 118

చ॥ తమకనుకూలపద్ధతులఁ ♦ దానటియించుచు, నేడుశాత్రవా
ధముల మెలంగుచుండెనిది ♦ ధర్మువుగాదని పెద్దలంద్రుమం

త్రములనెఱింగి నిష్కపట♦ తత్వయుతుండగువాఁడె రాజస
త్తములసభాస్థలంబుల ప్ర♦ధానిగనుండఁదగుఁ వివేకివై.

ఉ॥ కావున వానిభావమెఱుఁ♦ గక విధికైనవశంబుగాదు మీా
సేవకతం డనర్హుఁడని ♦ చెప్పఁగసంశయమున్నె?కొల్వులం
దీవిధనిట్టివారు వసి ♦ యింప నృపాలుర కెగ్గుగల్గునే
దేవరకిందుకొక్క కథ ♦ దెల్పెద నీమెడ నాలకింపుమీా.

—♦ చీ ర పో తు క థ ♦—

గీ॥ ఆర్య ! మందవిసర్పిణి ♦ యనెడినొక్క
చీరపోతుండెనదియొక్క ♦ భూరమణుని
శయ్యఁజేరి మెలంకువ ♦ సంచరించి
వేడ్కమీాఱంగ నెపుడు జీ ♦ వించుచుండు. 121

గీ॥ అంతనొకనాఁడు డిండిమం ♦ బనెడిమత్కు
ణంబు తచ్ఛయ్యకరుదెంచి ♦ నన్మదంబు
నందిమందవిసర్పిణి ♦ యపుడుదానిఁ
దీసికొనివచ్చి భక్తినా ♦ తిథ్యమిచ్చె. 122

మ॥ కుశలప్రశ్నమొనర్చియాకరణినా♦కుంజోద్యముంగూర్చుస
ద్యశముంబొందినవాఁడవీ విటకురాఁ♦దాత్పర్యమేమంచుఁబ
ల్కశరీరంబుబుకంగమత్కుణమువే♦డ్కన్నిన్ను నేనొండుకో
ర శరణ్యుండవటంచువచ్చితిని నా♦రమ్యార్థముం దీర్పుమీా.

చ॥ అనుచువచింప దానినుడు♦లద్భుతమొందుచునాలకించి తా
మనమునలేని వేడుకల ♦ మందవిసర్పిణి డిండిమంబునుం

గనుఁగొని నీమనోరథము ♦ గల్గిన నావశమైయొకండు దా
నిని నెరవేర్తునందులకు ♦ నీవిటులర్ నుతియింపఁజెల్లునే.

ఉ॥ నావినిడిండిమంబు జన ♦ నాథుల విగ్రహశోణితంబు నే
తావునఁగానికోరెడు వి♦ధంబులభించి యెఱుంగఁగావునన్
నీవిటనింక నాయునికి ♦ నిండుకృపామతి నీకొనంగ నా
సావనదోహదంబు జన ♦ వందితమై నెఱవేఱు నావుడున్.

చ॥ మదిముదమొందియందులకు♦మందవిసర్పిణిమిత్రరత్నమా!
యదనునెఱింగి నైమఱచి♦యానర నాథుఁడు నిద్రపోయినన్
మెదలకతేనిమైగఱచి ♦ నెత్తురుఁబీల్చి తొలంగిపోయి నీ
సదనమునన్వివేకమున♦సంచరియింపుమటంచుఁ బల్కెనన్.

కం॥ వినిడిండిమంబునీ చె
ప్పినయట్లు నటింతుననుచుఁ ♦ బృథ్వీపతిచం
ద్రునిమృదులతూలతలిమం
బున మెలఁకువతో వసించి ♦ మోహముమీఱన్. 127

చ॥ కువలయనాథుఁడుం బడక♦కుంజేనికూర్కకముందెవానిని
దవిలిశరీరముంగొఱికి ♦ నన్ జననాథుఁడు లేచి“సీ”యటం
చు విసివిసేవకుంబిలిచి ♦ చూడుడు దేహము తేలు గుట్టిన
ట్లవిసెడుఁదెమ్ముదీపమన♦నాతఁడుదివ్వియఁదెచ్చెఁజెంతకున్.

గీ॥ అంతలో మత్కుణంబు దా ♦ నతిరయమున
దూరముగఁబోవ నాపరి ♦ చారకుండు
పాన్పుసంతయుఁగని యొక్క ♦ ప్రక్కనెఱసు
పొల్కి నటియించు నాచీర ♦ పోతుఁజంపె. 128

—• ఆ శ్వా సాం త ము •—

ఉ॥ అంబుజపత్రనేత్ర! కరు♦ణాంబుధి! పంకరుహాలయాప్రియా
తుంబురనారదాబ్జభవ ♦ ధూర్జటిపాకహరాదిపూజ్యపా
దాంబుజ!సాధుమానిహృద♦యాంబుజసీమవిహార!దానవా
డంబరభంజనా ! ఫణిన ♦ టద్వరవిగ్రహ! లోకనాయకా.

కం॥ దుర్వార బాహువిక్రమ
గర్వితగీర్వాణవైరి ♦ గణఘోరమరు
న్నిర్వాపణనిర్యద్వర
దర్వీకర ! విష్టపప్ర ♦ తానాధారా ! 131

భుజంగప్రయాతము.

నగేంద్రాతిధీరాక ♦ నల్లోకవీరా
జగన్మోదదాయీ భు ♦ జంగేంద్రశాయీ
ఖగేంద్రాధిచారీ ప్ర ♦ కాండాసురారీ
జగత్సూత్రధారీ ♦ నృ ♦ శంసాపహారీ. 132

—♦ గద్యము ♦—

ఇది శ్రీరామచంద్రకరుణాసమాసాదితకవితాచాతుర్యకాశ్యప
గోత్రోద్భవమాదిరాజు వంశపయఃపారావారరాకా
సుధాకరాబ్బరాజామాత్యపుత్రజగ్గమాంబా
గర్భశుక్తిముక్తాఫలరఘునాథామాత్య
కవిప్రణీతంబగునీతికథామంజరియను
మ హా ప్ర బ ం ధ ము న
ద్వితీయాశ్వాసము

---

శ్రీరస్తు.
శ్రీరామాయ నమః.

# నీతికథామంజరి

## తృతీయాశ్వాసము

శ్రీవైదేహీహృద్భద్రా

జీవాంబురుహాప్త! మౌని ♦ చిత్తాబ్జవిహా

రా! విశ్వశ్రేణీసం

సేవితపాదారవింద! ♦ సీతారామా. 1

వ॥ అవధరింపుము. కావున గుణశీలంబు లెఱుంగక పరునిం జేర్చినవానికి హానిగల్గు. నావుఁడాకర్ణించి పింగళకుం డిట్లనియె— 2

ఉ॥ కాదనకుండ నోదమన ♦ కా! మదభీష్టము దీర్పుమిప్పుడీ
వాదురహంకృతిం గెరలు ♦ నట్టి వృషేంద్రుని చెంతకేగి నీ
వాదృతిఁజూపిశాత్రవుల ♦ నంటిచరింతువటంచు రాజు నీ
మీఁదఁగరంబుఁగోపమున♦మీఱుచునుండెనిదేమిచిత్రమో.

సీ॥ అయిననాతఁడు దయా ♦ మయుఁడుకావున నీవు
నా వెంటఁజేను దెంచి ♦ ప్రోవుమనుచు
స్వాపరాధముఁదెల్పి ♦ ప్రార్థించినఁ బ్రసన్నుఁ
డగునంచువచియింపు ♦ మయినదనుకఁ
జెలికారమును జేసి ♦ కలుపుకోలుతనంబు
నకుఁ గడంగుదము దా ♦ ని కనుకూలు
డై వచ్చెనేని మే ♦ లందు; దక్కెనఁ దత్ఫ
లము నందుఁ గాన వే ♦ గమునఁబోయి

గీ॥ రమ్ము మనమాట లేవియుం ♦ ద్రవ్వకుమన
దమనకుఁడు వల్లెయని యాన ♦ నమున దీన
భావము చెలంగఁ దొట్రిలఁ ♦ బదము లటకుఁ
బోయి సంజీవకునిఁగాంచి ♦ మ్రొక్కె నెలమి. 4

గీ॥ అంతసంజీవకుఁడుగాంచి ♦ యందరికిని
భద్రమేయన నాలించి ♦ వంచకంబు
భువిఁబరాధీనులకు క్షేమ ♦ మునకు మిగుల
నంతరంబుండు దానికిఁ ♦ జింతయేల ? 5

ఉ॥ నావుఁడునాలకించివృష♦నాథుఁడువంచకనాథ! తాల్మితో
నీవచనప్రకారము గ ♦ ణించిన నొండువిశేషమేదియో
భావమునం జెలంగెనను ♦ భావముతోఁచెడుఁగాన నింక నీ
వావిషయంబుఁదెల్పఁదగు♦నంచిరుప్రక్కలఁజూచెనయ్యెడన్.

చ॥ కనుఁగొనినానిలక్షణము ♦ కాటకపాటకులంత లేచిపో
యినఁగని వానివైపు నిపు♦డేమని తెల్పుదు ? వీరితోడ నీ

వనయము(జెల్మి(జేయుదువ♦టంచున్నృపాలు(డెఱింగెనిద్దియె
వ్వనికినసర్గ్వామానవెడు♦వాక్యముతోపదె? చూచువానిక్.

కం॥ రాజద్రోహులువీరను
నైజమునీవెఱిగి ప్రతిదిన ♦ నంబున నీ ని
స్తేజోవంతుల(జేర్చుట
రాజునకహితంబు; శుభక ♦ రంబె తలంపన్. 8

ఉ॥ కావుననిన్ను నాత్మసము♦ఖంబునకుంగొనిరమ్మటంచు నా
తోవచియించినన్ననిపె ♦ దోడనెవచ్చుటమేలు మీద నీ
భావమునందు(దోచునను♦భావవిధానము(బూనుమింతకున్
దైవమలంఘ్యమెవ్వరికి♦నా వృషభేంద్రు(డుభీతి(గాంచుచున్.

ఉ॥ నివ్వెఱవోయి యన్యులకు ♦ నేనొక కీడొనరింపలేదు నా
కెవ్వరు(గాని యెందులకు♦నెగ్గు(దలంతురు ? మంచివారలం
దివ్వసుధాస్థలిన్ వికృతి ♦ నేర్చుఖలాత్ముల చిత్తవృత్తు లిం
కెవ్విధినన్న నేమిఫల ♦ మీవిధిదాట(దరంబె ? యెరికిన్.

వ॥ తొల్లి కాకవ్యాఘ్రజంబుకంబులు కపటోపాయంబున నొక
క్రమేలకంబుందమ ప్రభువగు పంచాస్యంబుచే(ద్రుంగించె.
నీకా కథచెప్పెద నాకర్ణింపుమని సంజీవకుండు దమన
కునితో నిట్లనియె—— 11

—♦ ఒంటెకథ ♦—

గీ॥ దర్పసారంబనెడు మృగేం ♦ ద్ర మొకకాన
వ్యాఘ్రజంబుకకాకంబు ♦ లనెడిమంత్రి

పుంగవులతో నెపుడుఁ దాఁ జె ♦ లంగుచుండు
సర్వమృగములు కొలుచుచు ♦ సన్నుతింప. 12

సీ॥ శార్దూలకాకవం ♦ చకము లాకానలో
నొకనాడు దిరుగుచు ♦ నొక్కయుష్ట్రి
మునుగాంచి సంతోష ♦ మునను నీపేరేమి
యెటనుండిరాక నీ ♦ విటకనవుడు
నాక్రమేలక మిట్టు ♦ లనె వర్తకుఁడొకండు
మేటిభారంబు నా ♦ మీదవైచి
మోయించుచుండ నా ♦ మోపు నేను భరింపఁ
జాలకవ్వాని నీ ♦ లీలమొఱఁగి

గీ॥ యీయరణ్యముఁ జేరితి ♦ మీయనుగ్ర
హమునఁ గ్రాసంబువోనాడి ♦ యలరువాఁడ
నాకు మీకంటె మజేశర ♦ ణ్యంబులేదు
హితునివలెఁ జూడుఁడీవె నమ ♦ స్కృతులుమీకు. 13

చ॥ అనవుడునివ్వనంబునమృ♦గాధిపుఁడొక్కరుఁడుండె వీరుఁడా
తనికిట మేముభృత్యులము ♦ తాలిమితోనిఁక నీవు వానిద
ర్శనమును జేయుమేముతగు♦సాయమొనర్తుమటంచు నక్కప
ల్కినవిని నాదుపుణ్యము ఫ ♦ లించెనటంచు మహాంగ
మెంచుచుఁ. 14

ఉ॥ వానిపిఱుందవోవ మృగ ♦ పాలునకయ్యవిదానిసంగతిం
బూనికతోవచించి వెస♦ మ్రొక్కుమునానది మ్రొక్కినిల్వఁబం

చానన మామహాంగమున ♦ కాదృతితో నభయంబొసంగితా
నేనిటనీకమాత్యపద ♦ మిచ్చితిఁ గైకొని వేడ్కనుండుమీ.

ఉ॥ నావుడునుష్ట్రమంత మృగ ♦ నాథుఁడు చెప్పినరీతినుండెఁ దా
నీవిధినుండనొక్కతఱి ♦ నిట్లనె మంత్రులఁబిల్చి సింగమీ
నావిధినేమనందు నిట ♦ నాకిపుడామయకారణంబునం
జేవదొలంగె దేహమిఁక ♦ జీవనభాగ్యమదెట్లుగల్గునో. 16

గీ॥ కాన నారోగ్యమదికొంత ♦ గలిగి బలము
వచ్చి నడయాడునందాఁక ♦ వనమునందు
మీరలందఱు నాకు నా ♦ హారమిపుడుఁ
దెలివితోడ సంపాదించి ♦ తెచ్చియిండు. 17

చ॥ అనవుడువాయసాదులుమృ ♦ గాధిపునింగనిస్వామి! యీవనం
బున నెరనిట్లునీకు నొక ♦ పూటకుఁ దేఁగలవారమొక్కొ? మే
మనవరతంబు మీరుదిని ♦ యవ్వలి కేగినమీాద నున్నదా
నిని భుజియించిజీవనము ♦ నెట్టనఁ జేయుచునుంటిమాగతిన్.

గీ॥ తెలియనిదికాదు మాశక్తి ♦ దేవరకిట
ననఁగ వారలసింగంబు ♦ గనివచించె
దొరకినంతనెకానిండు ♦ తోడ్తమైనఁ
జాలుఁ గడపెదఁగాలమీ ♦ లీలననుచు॥ 19

ఉ॥ అంతటమారుపల్కుటకు ♦ నయ్యువిభీతిలి యెల్లభూములం
దెంతయుఁ గ్రుమ్మరిల్లి యెట ♦ నేమెరచిక్కమినన్నిపీడి వ
న్యాంతరవీధులం దిరుగు ♦ నట్టితఱిన్ వెసఁద త్రియంబు వా
సంతమురాకపూర్వమొక ♦ చేకటిఁ జేరుడు నంతఁగాకియున్.

ఉ॥ తక్కినవారిఁజూచి విది♦తంబుగ మీ కెర కొంచెమేనియుం
జిక్కినజోడ లేదె ? యిఁకేఁ♦జేయునదేమి ? సతంబు జేడిటఁ
మక్కువతోడదానిడిన ♦ మాంసములంబరులుబ్బ మెక్కెడే
డక్కట ! లేవలేనిసమ ♦ యంబున నీవిధమార్యధర్మమా.

ఉ॥ ఇప్పుడునొక్కచొప్పు మది ♦ కేర్పడుచుండెనదేమనందురా
తప్పక యీక్రమేలకముఁ ♦ దంత్రమునన్ సరిపెట్టి నేటి కీ
తిప్పలు లేక ప్రేనిపనిఁ ♦ దీర్చితిమాయిఁక నెల్లిపోలిన
ట్లప్పటిమాటచూతమన ♦ నంతసృగాలముపల్కె నీగతిన్.

సీ॥ మనయధీశుండుష్ట్రిమున ♦ కమాత్యపదంబు
నొసఁగిసన్మానించు ♦ చున్నవాఁడు
మనము దానికపాయ ♦ ము నొనరించితిమేని
నొవ్వించిరేనికి ♦ దవ్వగుదుము
కాన నీవిపుడు వ ♦ క్కాణించినవిధంబు
పోలదంచువచింపఁ ♦ జోలిమాలి
బలిభుజంబిట్లు ఘు ♦ ద్బాధితుండిలఁ గృతా
కృతములారయలేడు ♦ హితులనైనఁ

గీ॥ జెంపుటకుఁ బాల్పడునుగాని ♦ జెంకడనఁగ
వ్యాఘ్రమాలించి యట్టికా ♦ ర్యమునకతఁడు
నిష్టపడనిమ్ము మనకది ♦ హితముగాద
టంచు ధర్మవిధానంబు ♦ నెంచిచెప్పి.

ఉ॥ ఆతనిచెంతకేగి మన ♦ మంతటఁ గ్రుమ్మరిపడ్డబాధలం
గైతవముం దృజించిపలు♦కందగునా, సరియంచుఁబోయి సం
బ్రీతిజనింపఁ జేని గని ♦ పెక్కునమస్కృతులాచరించి స్వా
మీ! తగుపాట్లఁజిక్కి నను ♦ మేలొనఁగూడదిదేమికాలమో.

చ॥ అనుచువచించి కొంతవడి♦కయ్యవిమామువురందు దేవ! యొ
క్కనితమగర్భమందునిచి ♦ కల్గినయాకలిమంటఁ బాపికొం
డనిన మృగాధినాథుఁడన♦యంబునిమ్ముర్ దయఁగాచి నేటికీ
పనికిటులేనొడంబడుట♦భావ్యమె? లోకులునన్ను దూఱరే?

వ॥ కావున నిట్టి సంభాషణంబిఁక తేకుడు. దీనివలనఁ బరలోక
సౌఖ్యంబులకు దూరుండనగుదునన జంబుకంబు కాకంబుం
గాంచి నీవు సైకంబవు నిన్ను గర్భంబునఁ జొన్పినను
జేనికి క్షుద్బాధానలశిఖావ్రాతంబణంగదు. నా మేను
జేనికి భోజ్యంబుజేసి కృతార్థుండనయ్యెదనన దానింగాంచి.

ఉ॥ గోలయొనర్ప నేటికిది ♦ గూడునె? యంచువచించివెంటశా
ర్దూలముఁ మీఱలెవ్వరికఁ ♦ దూగరుదీనికి నేనుజేని కీ
లీలమదీయదేహమును ♦ లిప్సనొసంగెదనంచుఁబల్క నా
కాలమునంగ్రమేలకము♦గ్రక్కునఁదాఁజేనుదెంచితద్విధిర్.

మ॥ వినిసాంతంబుగ దీని కీ విధమునర్ ♦ వేసారుటర్ లాభముం
డునె? యిద్దానికి నేసమర్థుఁడను నా♦టోపంబుమీ కేలరా
జునకుర్ నావలనంబ్రయోజనమిటర్ ♦ సుంతైన లేదంచుఁబ
ల్కిన గోమాయుముజేనిఁగాంచి తమకీ ♦ కృత్యంబు
యుక్తంబగుర్. 28

ఉ॥ భృత్యుఁడుస్వామికార్యముల♦భీతివహింపకపిల్కుమారినన్
నిత్యసుఖంబులందనుపు♦నించుదివంబు లభించు దీన మీ
కత్యయ మేమి లేదన మృ♦గాధిపుఁడంతటఁజూడనుష్ట్రిమున్
సత్యముజంబుకోక్తి ననుఁ♦జేంకకధన్యునిఁజేయు మంచేనన్.

కం॥ తుదకాకలిబాధకు న
య్యదిమోర్వఁగలేక లొట్టి ♦ యం జంపి తినెం
గుదురుకొను క్రొత్తవానిని
మొదలంటహరింత్రు రాజు ♦ మునుపటిలెంకల్. 30

వ॥ కావున క్షుద్రపరివేష్టితుండగు భూనాయకుండు భయంకరభుజంగసంఘాతావృతపటీరపాదపంబుచందంబునఁ బరిసరజనంబులకు ముప్పుపుట్టించును. దీని కొక్కకథ వక్కాణింతు వినుము. 31

## —♦ వ డ్లం గి క థ ♦—

సీ॥ ఇలనొక్కపురమందుఁ ♦ గలఁడొక్క వడ్లంగి
వాఁడు నానాఁడుఁ దా ♦ వనికిఁబోయి
పనికియుక్తంబగు ♦ పాదపవ్రాతంబు
ఖండించి స్తంభాది ♦ కము లొనర్చి
కొనితెచ్చి పురికమ్మ ♦ కొని సదాజీవించు
చుండు వాఁడొకనాడు ♦ నొక్కచోట
వనిలో సుహృద్విలో ♦ చనము నాఁబరగు పం
చాస్యంబుఁగాంచి భీ ♦ తాత్ముఁడగుచు

గీ॥ నిలువఁబడియుండ నామృగ ♦ నేతఁ గాంచి
పరమకరుణాంతరంగుఁడై ♦ పలికె నిట్లు
మన్నఖంబులు మీమీఁద ♦ మరలి తెగవు
ధైర్యమునువీడి త్రాస మొం ♦ దకు మటంచు. 32

ఉ॥ అంతటఁ బెక్కు చందముల♦నాతఁడు మ్రొక్కి నుతించిసింగముం
జింతలుదీఱఁ గోరికలఁ ♦ జెందుచు నప్పటినుండి దాని న
త్యంతముదంబుమీఱ వివి ♦ ధ ప్రశస్తవనీయఫలాదులిచ్చి తా
నెంతయుఁ దన్పుచుండుఁ బృథి♦వీశుఁడసంభ్రతివాసరంబుల్.

సీ॥ ఇట్లు కొన్నిదినంబు ♦ లేగ సింహంబుతో
నొకనాఁడు గాకజం ♦ బుకములరుగు
దెంచి యిష్టాగోష్ఠిఁ ♦ దేలుచుం దేవర
వారీవనింగొన్ని ♦ వాసరముల
నుండి వేటకుఁ బోవు ♦ చుండఁగానము కార
ణము గానుపింపదు ♦ నామృగేంద్రు
డాలించి యీరీతి ♦ నాడె వడ్లంగి యొ
కఁడస్మదీయ భ ♦ క్తుండు గలఁడు

గీ॥ ప్రతిదినంబున నాహార ♦ మతఁడు దెచ్చి
యిచ్చుచున్నాఁడు నావిని ♦ మెచ్చి కాక
జంబుకములంత నామృగ ♦ స్వామిఁ జూచి
యతనిఁ జూపుడు ధన్యుల ♦ మగుదుమేము. 34

ఉ॥ నావుడు నాలకించిమృగ♦నాయకుఁ డట్లెయటంచు వానితో
డావసియింపనొక్క యెడఁ♦దాలిమి నాతఁడువచ్చి చూచియా

తావ్రననున్న పాదపముఁ♦ ద్రాసముతో వెసనెక్కి-నంగ్రపా
భావముతో మృగేంద్రమట♦వానినిడాసియిదేమినావుదుర్.

గీ॥ అవనిసార్థకనామధే ♦ యంబులగు న
రిష్టవంచకములు రెండు ♦ రెండువైపు
లందు నీకుండుటంజేసి ♦ యిందువేగఁ
జేరితిని దుష్టయుతు రాజుఁ ♦ జేరఁదగదు. 36

గీ॥ అనుచు వచియించి యాభూరు ♦ హంబునందె
యుండి భయమునఁ ♦ గదలక యొక్క-చేనుప
వచ్చుచుండంగ దానిని ♦ వచ్చిచేరి
కడురయంబున నక్కా-న ♦ వెడలి చనియె. 37

గీ॥ సజ్జనుండయ్యు నెపుడు దు ♦ ర్జనులతోడి
సంగతిం దుర్జనుఁడునాఁ జె ♦ లంగుచుండు
బకకదంబముతో మిత్ర ♦ భావమొంది
తిరుగుహంసంబుబకమునాఁ ♦ బరగుఁగాదె ? 38

కం॥ మించినకార్యమునకుఁ జిం
తించిన ఫలమేమి ? మిగుల ♦ ధీరుఁడనై కా
వించి కలిగ్ దిశల న్నిం
డించెద రణశూరవినుత ♦ నిర్మలయశమున్. 39

మ॥ అటుకాదేని సమస్తశూరజనమా ♦ న్య స్వర్గసౌఖ్యంబులు
తక్క-టమోదంబునఁ బొందువాఁడననివ♦కాక్క-ణింపనాలించివి
స్ఫుటశౌర్యాంచితయుష్మదీయవచనం♦బుల్ సత్యముల్ కానియొ
కక్క-టినాలింపుమటంచుజంబుకముప♦లక్క-ంబూ నెనీవైఖరిన్.

సీ॥ భవదీయవచనంబు ♦ లవని శూరశ్లాఘ
నీయంబులైన నే ♦ దో యుపాయ
మును విచారించి వై ♦ రినిదాకి సాధింప
నోండె వెంటఁదోలంగ ♦ నోండెమేలు
సాహసంపడి మహా ♦ సంగ్రామమరణంబు
శ్రేయంబటంచు వై ♦ రికులమంటి
ప్రాణంబుదొరగుట ♦ పాడిగాదనుమాటఁ
బాటించిపిదప నా ♦ పగఱతరము

గీ॥ నెఱఁగి విజయంబుదా నిశ్చ ♦ యించి పోర
భయము విడనాడి మారొ్కన ♦ వలయు దీని
కెపుడు విపరీతమగునప్పు ♦ డెందుఁగాని
తప్పదు పరాభవము శచీ ♦ ధవునికైన. 41

—♦ టిట్టిభము కథ ♦—

గీ॥ తొల్లియవివేకమున సము ♦ ద్రుఁడొక టిట్టి
భంబు నెదిరి పరాభవిం ♦ పంగఁబూని
తాఁబరాభూతుఁడయ్యె న ♦ ద్దానిఁబూర్ణ
ముగ వచించెద వినుము స ♦ మ్మోదమలర. 42

సీ॥ జలధితీరంబునఁ ♦ గలయొక్క తరువుపై
తీతువొక్కఁడుగూడు ♦ దీర్చికట్టి
కొనియాత్మసుందరిం ♦ గూడి కాపురముండెఁ
గడువనిట్టులఁ గొంత ♦ కాలమునకుఁ

దనకాంత గర్భంబుఁ ♦ దాల్చుటంగాంచి నీ
యిష్టంబు వేడు మే ♦ నెట్టిదైనఁ
గూర్తునావుడు నాశ ♦ కుంతాంగనామణి
చెలువునింగాంచి యి ♦ ట్టుల వచించె

గీ॥ మదభిమతమొండు గలదు చె ♦ ప్పెద వినుండు
పర్వదినములలో సరి ♦ త్పతిమహోగ్ర
తుంగభంగములు చెలంగ ♦ నింగిముట్టి
హెచ్చి యచ్చెరువుగఁబొంగి ♦ వచ్చుఁగాదె? 43

మ॥ మనయావాసము చెంగటం గలుగుటన్ ♦ దత్తీరజంబుపై నుండు నం
డనికాయంబులు నీటిపాలగునుకా♦నన్ మందిరంబొండుచూ
డనగున్ మీరికనాలసింపకుడి వెం♦టన్ సూతికాలంబుడా
సినవేళన్ వెసనన్యదేశగతియున్♦ శ్రేయంబుగాదేమెడన్.

చ॥ అనవిని దానిమాటలకు ♦ నావిహగంబుహసించితమ్మిగుం
పునకరుణుండుఁగల్వలకుఁ♦బూర్ణ శశాంకుఁడుఁ జాతకవ్రజం
బునకుఘనుండు నెట్లటులఁ ♦ బుల్గులకున్ ఖగరాజురాజుకా
వున నీఁక నీజడాశయుఁడుఁ ♦ బోనె? మెదుర్కొని యస్మ దాదులన్. 45

గీ॥ ఏల యీలీల నాతరం ♦ బెఱుఁగలేక
లేనిపోనివిచారంబు ♦ మానసమునఁ
జేర్చెదవుగాన ధైర్యంబు ♦ చే వసింపు
మనఁగ టిట్టిభియిట్లని ♦ యానతిచ్చె. 46

ఉ॥ ఎట్టిజనుండు రాఁగలుగు ♦ నెగ్గునణంచెడుసాధనంబుఁ జూ
పట్టినమీఁదటన్ వెడఁపుఁ ♦ బాసివసించిన మేలుగాని తాఁ
బట్టినపట్టు వీడకిటు ♦ పాలసుఁడై నటియింప విజ్ఞులే
పట్టున గర్వియాతఁడని♦పల్కుచుఁ దిట్టరె? మాటలేటికిన్.

గీ॥ హితము విననట్టి బాలిశుఁ ♦ డెపుడుఁగోల
విడిచిపడినట్టి కమఠంబు ♦ విధిధరిత్రిఁ
గాలధర్మంబునొందు నా ♦ కథముదంబు
దనరసాకల్యముగఁ జెప్పె ♦ దను వినుండు. 48

—♦ తాబేలు కథ ♦—

చ॥ జగతివెలుంగుచున్ భువన ♦ సారసరోవరమొక్కడుండె నె
ప్పుగిదినెసంగునద్ది బహు ♦ పక్షికదంబ విహారయోగ్యమై
సొగసులమీఱుపద్మముల♦శుద్ధమరందచరద్భ్రమాళినా
దగరిమశాలియై విబుధ ♦ తామరసాక్షిజలక్రియార్హమై.

సీ॥ అందఁగంబుగ్రీవ ♦ మను కూర్మము వికట
సంకటంబులను హం ♦ సములతోడి
చెలిమితోవర్తించు ♦ నిలఁగొన్నిరోజుల
కటవానలేమిఁ బ ♦ ద్మాకరాంబు
పూరంబివురఁబాఱ ♦ నారాజహంసంబు
లన్యదేశంబున ♦ కరుగఁదలఁచి
కూర్మంబుచెంతకుఁ ♦ గూర్మితో నరుదెంచి
తమయిచ్ఛఁగలుగు న ♦ ర్థంబు నుడివి

సీ॥ కడకు నీకు వియోగదుః ♦ ఖంబుమీఱు
చుండె మేమేమి సేయుదు ♦ ముల్లమందు
మఱువకుండుము సఖ్యంబు ♦ సరిగివత్తు
మనవుడాకచ్ఛపంబిట్టు ♦ లనియె వగచి. 50

గీ॥ ఇంతకాలంబు మనమీ వ ♦ నాంతరమునఁ
బరగుచుంటిమి చెల్మిసో ♦ దరులభాతి
దీనికొకక్కడొనఁగు కల ♦ నేని పోనఁగు
ననితలంచి యెఱుంగ నా ♦ మనమునందు. 51

శా॥ మీతో నీయెడఁగూడి పక్షములబ♦ల్మిన్ రా విపత్సుండనే
రీతిన్ వచ్చెద? గాన నెట్లయినఁగూ♦ర్మింబూనినన్నున్ వడిన్
మీతోఁగై కొనిపొండునామిగులఁదా♦ల్మిన్ లోనమోచించినీ
గీతో క్తిన్వినిసాహసంబునకు నుం ♦ కింపన్ మనంబొప్పునే?

చ॥ ఎటులగునో యెఱుంగమిఁక ♦ నీనెలవున్విడనాడి నీవు వ
చ్చుట సరికాదటంచునవి♦చొప్పుడఁజెప్పినఁ గచ్ఛపంబు మి
కుక్కటముగఁ గక్కసించెఁ దుద ♦ కున్ విహగంబులుదానిఁ గాంచి నీ
యటమటదీఱ నొక్క వెర♦వారయగల్గితిమాలకింపుమీ.

గీ॥ యష్టినొకదానిఁగొని దాని ♦ యగ్రతలము
లేముచెఱియొక ప్రక్కన ♦ నెలమిపట్టి
కొనిపఱతుమీవు తన్మధ్య ♦ మును గ్రహించి
వీడకుండుదు వేని మా ♦ వెంటరమ్ము. 54

చ॥ అనవుడు వల్లెయంచునది ♦ యావిహగంబులు తెచ్చినట్టియ
ష్టినిఁగొని వ్రేలఁజంచువుల ♦ చే నవినింగితదంచలంబులం
గొనిచనుచుండ దానిఁగని ♦ కూరిమితో నొకపట్టణంబులో
ని నరులు పలుకనట్టి నుడి♦ నిక్వణముల్ చెవిసోకినన్ వెసన్.

గీ॥ కూర్మ మీధ్వనివచ్చుట ♦ కుఁ గతమెద్ది
యనుచు నాఖేచరంబుల ♦ నడుగనోరి
పట్టువదలి భువింబడి ♦ పలలలుబ్ధు
లగు జనులచే హతంబయ్యె ♦ వగపుఁగాంచి. 56

ఉ॥ కానవివేకవంతుఁడెటఁ♦గాని యుపాయముఁబూనికార్యసం
ధానచణుండునై మెలఁగి♦నన్ శుభముల్సమకూడుఁగానిస్వ
స్థానముఁబాయకే యెడల♦దైవపరుండయియుండఁగూడద
వ్వానికిఁ గీడుతప్పదని ♦ పలుకబుధోక్తుల నాలకింపవా ?

## —♦ చేపలకథ ♦—

వ॥ ఈ యర్థంబు తేటఁబడ నీకొక్కకథావిశేషంబు చెప్పెద
నాకర్ణింపుము. తొల్లి యొక్కజలాశయంబున ననాగత
విధాతయుఁ, బ్రత్యుత్పన్నమతియు, యద్భవిష్యంబునని
మూడు మత్స్యంబులు సంగాతంబునంజేసి వర్తించుచుండె.
అందనాగతవిధాత, ప్రత్యుత్పన్నమతియద్భవిష్యంబులం
జూచి యిట్లనియె. 58

సీ॥ ఈవత్సరంబున ♦ నింతవఱకువాన
లేదయ్యెనెట నింక ♦ మీఁదనైనఁ
గురియునాసమొకింత ♦ కూరదు కాలంబు
ప్రతికూలముగఁదోఁచె ♦ వారిజాక
రమునందుఁ గలుగు నీ ♦ రంబు లెండకమున్నఁ
దెలివితోఁ జరియింప ♦ వలయు లేక
మసలిన మోసంబు ♦ పొసఁగుఁగావున నిచ్చ
టికిఁ గొంతదవ్వున ♦ ఔందమునకు

గీ. నతిముదంబిఔడు ధ్రువోద ♦ మనుప్రహాదంబు
కలదు; మనకిచ్చటికి నీటి ♦ కాల్వ యచటి
నుండి విడువకవచ్చుచు ♦ నుండునదియు
వెనుకమూయఁగఁ దోయంబు ♦ వెనుకఁదీయు. 59

ఉ॥ కావున నేటిరాత్రి నల ♦ కాలువలోఁబడి యాప్రహాదంబు నిం
కేవిధనైనఁ జేరి మన ♦ మీవగఁ బాపికొనన్వలెన్ మహా
ధీవరులింతకున్మునుపు ♦ తేఁకువతోఁ జేనుదెంచి యింక నీ
జీవనముల్గనుంగొని "యి ♦ సీ" పదిరోజులకింకఁ బాఔడిన్.

ఉ॥ అప్పటికేగుదెంతమని ♦ యందరుజోలరులాడికొంచు వా
రప్పటికప్పుడుంజేనిరి ♦ యావచనంబుల నాలకించుచు
న్నప్పటినుండి నాదుహృద ♦ యంబుడికిల్లె నుపద్రవంబురాఁ
దెప్పిలుదారిఁజూచెదరు ♦ ధీనిధులేమొడనంచుఁ బల్కినన్.

కం॥ మనమున నానందించుచు
వినిప్రత్యుత్పన్న మతి వి ♦ వేకియుతుఁడు నా
నసె దీనికింత యేటికి
ననరంతగ వచ్చినప్పు ♦ డరయుదమనుచున్. 62

గీ॥ యద్భవిష్యంబు తా మాట ♦ లాడకుండె
నంతట ననాగతవిధాత ♦ యాజలాశ
యము వెడలిపోయి యెయ్యెనా ♦ యర్ధరాత్రిఁ
దగునుపాయంబుతో ధ్రువం ♦ బుఁ జేరె॥ 63

చ॥ ఇఁకనిటనంతకంతకగు ♦ నెండలమెండున నెండ నీరు మై
నికులు రయంబునన్వెడలి ♦ నెట్టనమావులు గట్టిమీనబం
ధకములు గట్టెలెత్తెలలు ♦ నాదగుసాధనముల్గ్రహించి వే
డుకలఁజెలంగి చేపలఁబ ♦ ట్టుత్వముమీఱఁగఁ బట్టి
యాడ్చుచున్. 64

చ॥ స్తిమితముతోడగట్టునకుఁ ♦ జేర్చుచునుండగనందు యద్భవి
ష్యము కడుమిట్టిమిట్టిపడఁ ♦ జంపిరి; రెండవచేప నీటిపై
ననుసినయట్లు తేలగిల ♦ జాలరులంతటఁజూచి నీళ్ళు తీ
రమునకుఁజిమ్మి మీననిక♦రంబులగైకొని గట్టుఁజేరుచున్.

గీ॥ అద్ది తామెల్లఁగాఁబోయి ♦ యాజలంబుఁ
దాటి తప్పించుకొని బారిఁ ♦ దొలఁగిచనియెఁ
గాన మతిమంతుఁడేయెడఁ ♦ గాని కీడు
గనడు నావిని టిట్టిభ ♦ మనియెనిట్లు. 66

కం॥ ఇందుఁలకై డెందంబునఁ
గొందలమందకుము పనులు ♦ గూడినవేళన్
డిందుపడకేమగంటిమిఁ
బొందుపడం జేసి యశముఁ ♦ బొందెదఁగనుమీ. 67

చ॥ అనవుడు నాపులుంగుచెలి ♦ యంతటభర్తకుమారు పల్కఁగా
మనమున భీతినూరుకొనె ♦ మార్పులు లేకది కొన్నినాళ్ల కం
దునఁ బ్రసవించినం గినిసి ♦ తోయవిభుండల పక్షిపంతముం
గనవలెనంచుఁ బొంగితమ ♦ కంబునఁ గైకొనియెం దదండముల్.

ఉ॥ పిమ్మట నాపులుంగుచెలి ♦ పెన్మిటిఁగన్గొని త్రొల్లి నాదు వా
క్యమ్ములు త్రోసిపుచ్చి విన ♦ రైతి రిఁ కేమిఫలంబటంచు బా
ష్పమ్ములు కాల్వలోయనఁగ ♦ జారుచునుండగ నంగలార్చినన్
నెమ్మది లేకటిట్టిభము ♦ నెమ్మిసతిన్ బుజగించి మీదటన్.

చ॥ పులుగులగుంపుఁ గూర్చికొని ♦ పొంగుసముద్రునిపాటు
వానితోఁ
తెలియఁగఁ బల్కి వారిధులఁ ♦ దెంపరియై యొకసారి పుక్కిటం
గలయఁగఁ బట్టజాలిన జ ♦ గన్నుతశూరుఁడుఁ బన్నగాశనుం
డిల మనకుం బ్రభుండనుచు ♦ నీజడరూపుఁ డెఱుంగ డేయెడన్.

ఉ॥ కావున వానికింక మన ♦ కష్టవిధం బెఱిఁగింపకున్న నీ
జీవననాయకుండెపుడుఁ ♦ జేవఁదొఱంగడు తాల్మి దా నహం
భావముమానఁ డిప్పనికిఁ ♦ బంతమెయంచేనరాదు పోయి యా
దేవనుతున్ ఖగేశు విను ♦ తించిన మేలుఘటించు నాతఁడున్.

చ॥ అనితమితోనొడంబఱిచి ♦ యావిహగంబులు దానుభక్తితో
వినుతులొనర్పనాతఁడట ♦ వేగమునంగనిపించి మీ మనం
బునఁగలదోహదంబులను ♦ బొందుఁడొసంగెద నాఖగంబులం
బునిధియొనర్చినట్టి విధి ♦ పోలవచించిన నాతఁడల్కతోఁ.

గీ॥ జలనిధింగాంచి తనమహా ♦ శాసనమున
నండములనెల్లఁ దెప్పించి ♦ యావిహంగ
ములకు నిప్పించి మాజనం ♦ బులకు నింక
నెగ్గుదలఁపకుమదినీకు ♦ లగ్గుగాదు. 73

గీ॥ అనుచుశాసించి యావిహం ♦ గాధినాథుఁ
డచట నంతర్హితుండయ్యె ♦ నంత టిట్టి
భంబు తమవారితో నిశాం ♦ తంబుఁజేరి
సతికి నండంబులంజూపి ♦ సౌఖ్యమొందె. 74

ఉ॥ నావినిసంతసించుచు మ ♦ నంబున నక్కలతేనిఁగాంచి సం
జీవకుఁడిట్లనెఁ ధరణి ♦ జీవులకేమెడనైన డాగినం
జావులభింపకుండునె? వి ♦ చారమదేటికి? పుట్టగిట్టుమ
ర్త్యావళినెందఱంగనమ ♦ యారె? హాళాహాళిఁజెందనాయమే.

ఉ॥ మిత్తినిబట్టిగెల్వఁగల ♦ మేటియొకండుగలాడె? దానిచే
హత్తుకొనంగ దుష్టయశ ♦ మందుటఁగానిమఱొండుగాదు నా
చిత్తముప్రాణహానికిని ♦ సిద్ధమెకాని సుమానహానికే
మెత్తుననోర్వఁజాలదిది ♦ యంతయు నిక్కముమాట లేటికిఁ.

ఉ॥ కావున నేనుయుద్ధమున ♦ కై చేనుదెంతునటంచు జేనితో
నీవువచింపుమింక నిట ♦ నిల్వక పొమ్మన వంచకంబు సం
జీవకునాజ్ఞ వేగమున♦సింహముచెంతకుఁబోయి వానితోఁ
దావచియించెసర్వము య♦థావిధిఁబూసలఁగ్రుచ్చినట్టులన్.

ఉ॥ కక్షవహించి గోవిభునిఁ ♦ గాలునివీటికిఁ బంపఁబూని హ
ర్యక్షమవార్యకోపమున ♦ నార్చుచునుండఁగగోవిభుండుప్ర
త్యక్షముగా రణంబునకుఁ ♦ దావెసరానట రెంటికిన్ సహ
స్రాక్షుని కైనఁ జూడఁదగ ♦ నట్టిమహారణమయ్యెనంతటన్.

వ॥ అట్టియెడఁ గరటకుండు దమనకుంగాంచి దమనకా! భవ
దీయమంత్రశ్రవణఫలంబు మెకంబులమెకిమీ డనుభవిం
చెడు. కంటివే; కార్యాకార్యవిచక్షణంబులే కిట్లాచరించుట
న్యాయంబగునె? లోకంబునం గొందఱు విజ్ఞులమని తామ
కృత్యాకృత్యంబుల నిర్ణయింతురు. వైపరీత్యంబున దైవాను
కూల్యంబు పొసంగదని వక్కాణింతురు గాని తమ యవి
వేకంబని విచారింపరు. అట్టిమూర్ఖులకు బుద్ధిచెప్పఁ
బూనినవాఁడు మర్కటంబులకు బుద్ధిఁజెప్పఁదలంచిన
సూచీముఖంబు చందంబునఁ గీడొందును. అక్కథ వక్కా
ణించెద వినుము. 79

—♦ సూ చీ ము ఖ ము క థ ♦—

కం॥ హిమవద్భూమిధరప్రాం
తమునన్ లలితఫలసుమ వి ♦ తానయుతార

ణ్యముగల దచ్చట వానర
సముదాయమొకండు సంత ♦ సమున వసించున్. 80

గీ॥ ఒక్కరోజున నాగుంపు ♦ మిక్కుటమగు
శీతబాధితమై మహా ♦ జ్యోతిరింగ
ణనికురంబముఁగని వహ్ని ♦ యనెడిబుద్ధి
డాసి చలిగాచుకొనుచు నుం ♦ డంగ నచట. 81

కం॥ సూచీముఖమనువిహగము
చూచికపీంద్రంబులార ! ♦ చోద్యంబగు నా
లోచింపఁగ నివి మిడుఁగురు
లాచాయంజూడు డచట ♦ ననలంబుండెన్. 82

చ॥ అటకరుదెంచి కాచికొని ♦ యాచలిపాపికొనుండనంగ మ
ర్కట మొకఁడందునా నుడికి♦ గాఢతరంబగుకోపమూని నీ
విటనిటుమాకు బోధకుఁడ♦వేయని నిక్కుచు వెక్కిరించిసం
దిటఁగొని యాఖగంబుఁ గడ ♦ తేర్చె నఖంబులఁ గ్రుచ్చి
గ్రక్కునన్. 83

చ॥ ఇలమతిమంతుఁడెంచి మతి♦హీనునకాడుహితంబు మేలుగాఁ
గలదె? హితప్రబోధకుని♦కంటె హితోక్తుల నాలకించువాఁ
డలవడ డెందునం; దనకు♦ నన్నిటిలోనశుభంబుఁగోరి య
న్యులకునుఁ గీడుగోరు జను ♦ డొందు వినాశము మాటి
మాటికిన్. 84

## —• వ ర్త కు ల క థ •—

వ॥ తొల్లి నందిగుప్తుండనువాఁడు సుదర్శనగుప్తుని వంచింప నెంచి తండ్రిని ధనంబును గోల్పోయె నక్కథ వకాణిం చెద నాలకింపుము. 85

సీ॥ భువిజనావతియను ♦ పురి సుదర్శనగుప్తుఁ
డును నందిగుప్తుండు ♦ ననెడువర్త
కులు నిర్వురేమెడఁ ♦ జెలిమినుండిరి; వారు
ధనము సంపాదింపఁ ♦ దలఁపుగలిగి
యన్యదేశంబున ♦ కరుదెంచి కొంతకా
లము పాలిబేరంబు ♦ ల నొనరించి
యభిమతంబొనగూడ ♦ నభిజనంబునకు రా
నందిగుప్తుఁడు మహా ♦ నందమొంది

గీ॥ యలసుదర్శనగుప్తుని ♦ నంతఁగాంచి
మనము ధనముల నిపుడుఁ దె ♦ చ్చినవిధంబు
మఱచిపురమున వెల్లడిం ♦ పంగఁజనదు
మదిఁదలంపుమువిబుధ సం ♦ భాషితముల. 86

మ॥సరఘాశ్రేణిసమార్జితాచ్ఛమధుపూర్ణ♦సర్వంబుడెందంబునం
గరుణన్వీడి జనుల్గ్రహింతురుగదా ♦ కాబట్టి లోకంబునం
దరయన్ న్యాయసమార్జితంబగుధనం♦బన్యుల్గ్రహింపంగఁజూ
తురుదీనిన్నగరంబుబాహ్యమునసెం♦దుంగానిదాపందగున్.

చ॥ వలసినవేళఁ దెచ్చికొన ♦ వచ్చుననంగ సుదర్శనుండు నీ
తలఁపు యథార్థమల్లెయని♦దానిని నిర్వురు నొక్కబిందెలో
పలవెసఁబోసి యొక్క వట ♦ పాదపసన్నిధిఁబాతి మందిరం
బుల కరుదెంచిడెందముల♦పొందునవర్తిలుచుండిరేయెడన్.

గీ॥ కొంతకాలంబునకు నంది ♦ గుప్తుఁడొక్క
వాసరంబున నల్లగు ♦ ప్రస్థలమున
కరిగి యాబిందెద్రవ్య తా ♦ నపహరించి
కడువెసందెచ్చి డాపటి ♦ కంబుఁజేసి. 89

మ॥ తనుపారన్ మఱికొంతకాలమున కా♦తండొక్కనాఁడాసుద
ర్శనగుప్తుంగని విత్తమెత్తుకొనిరా ♦ సందేహ మేమాత్రమై
నను గాన్పింపదు రమ్మటంచుఁ గొని వెం♦టంబోయి యా
చిహ్నముం
గనియామేదినిఁద్రవ్వినన్ ధనమటం♦గాన్పింపదాయెన్వెసన్.

ఉ॥ అంతట నందిగుప్తుఁడట ♦ నచ్చెరువందుచు వానిముందటం
జింతిలు నాసుదర్శనునిఁ ♦ జేతనురంబును బాదికొంచు నీ
యంతటి మిత్రహంతకుఁడ♦యారె? జగంబున లేడుచెల్మితో
నింతకు నీవొడంబడితి ♦ వే నినులోకము లాడిపోయవే.

ఉ॥ కంటికిఁగానరాక తమ ♦ కంబున నద్దమరేయి నెప్పుడో
యొంటిగవచ్చి నీవు ధన♦మొయ్యనఁగైకొనియజ్ఞుఁడట్లయా
కొంటెతనంబునం బదుల♦కొంపలఁగూల్తువె? లేక యీధనం
బంటఁగ నేరికిం దెలియు♦నా? మఱిదానికిఁ గాళ్ళువచ్చెనా?

సీ॥ కానిమ్ము, రా, నిన్నుఁ ♦ బోనిచ్చెదనె ? నంది
గుప్తుండలంతులఁ ♦ గూర్చువాఁడ
టంచు నీవెంచకు ♦ మాసొమ్ము నీచేతఁ
గ్రక్కింపకున్న నే ♦ నొక్క-మేటి
మగవాఁడనాయంచు ♦ జగడంబుసేయుచు
నాసుదర్శనగుప్తు ♦ నంటికట్టు
పుట్టంబుఁ జేఁబట్టి ♦ భూనాయకుని కొల్వు
కూటంబునకురాక ♦ కుదుటపడ వ

గీ॥ టంచులాగిన కోపంబ ♦ ణంచుకొంచు
నాసుదర్శనగుప్తుండు ♦ నతనిఁజూచి
యేలచిందులు వైచెదు ♦ తాళుమింక
వినుము నాపలుక్క-లంత నీ ♦ విధముఁ గనుము. 93

చ॥ వదలుమనంగఁ గోప మని♦వార్యముఁగా, నలనందిగుప్తుడుం
బదిలముగానటింపఁ గల ♦ వాఁడవు నీవు; ధనంబుపోయి క
ష్టదశవహించు నేనెటుల♦స్థైర్యముతో నివసింతుఁ? గాన ని
య్యది సరిపోక నీనుడుల ♦ నా వినఁగావలె? సిగ్గులేదొకో.

మ॥ నినువీడందగవౌనె?రమ్మనఁగఁగా♦నిమ్మల్లెయంచుఁ౯ సుద
ర్శనగుప్తుండట వానితో నరుగుదే♦ర౯ నందిగుప్తుండు తా
మనుజాధీశునిడాసి సర్వమెఱిగిం♦ప౯ మీద నన్యుండు ప్రమొ
క్కి-నివేదించె యథార్థసంగతులఁదా♦ ఖేదంబువేధింపఁగ౯.

గీ॥ అంతటం బార్థివుండు ధ ♦ ర్మాధికృతుల
నటకు రావించి యిరువుర ♦ నప్పగించి
వీరి తగవును దీర్పుడు ♦ మీరటంచుం
బలికివారి నియోగింప ♦ వారలపుడు. 96

ఉ॥ వారివివాదమెల్ల విని ♦ వాదిం గనుంగొని త్రవ్వివిత్త మె
వ్వారలుచూచుచుండంబ్రతి♦వాదిహరించె? దలంపసాక్షులు
న్నారుగదా? యనంగం గొను ♦నా? ధన మన్యులెఱుంగ
దొంగ; మె
వ్వారలు సాక్షులుండిరని♦ వారలం దెచ్చెద నక్కటక్కటా.

ఉ॥ అచ్చటనొక్క మఱ్ఱిగల ♦ దన్యము లేదు మఱేమిసేతు నే
నెచ్చటంజొత్తునా కిపుడు♦నెయ్యది దిక్కని ఖేదమొందుచుం
బొచ్చెము లేనిమార్గమునం ♦ బోవుదు నేని వటంబెసాక్షియై
వచ్చినమీరలెల్ల వినం♦ బల్కెడుగాక యథార్థ తత్వముల్.

చ॥ అనిశపథంబొనర్పం గని ♦ యచ్చటివారితం డెట్టిపుణ్యుండో
తనరుచు లేనియట్టి శప ♦ థం బొనరింపంగ నేరికానె? నై
ననునిదిచూడ కెప్పగిది♦నాయముదెల్పంగ రాదు సర్వముం
గనుంగొనుచుండు దేవుండల♦కల్లనిజంబు లెఱుంగు నేమెడల్.

చ॥ అనుచుందలంపవీండెధన♦మంతయుం దెచ్చిహరించిపాపమా
తనిపయి నిందమోపి యిటు♦తానిట నెంతటిసత్యవంతుండో
యనెడియశంబుం బొందవలె♦నంచుమహార్భటిసల్పుచుండెనో
కొ? నెఱియ "అంకుటాలికినిం♦గ్రొత్తడిసుద్దులు పెక్కులౌ"
గదా? 100

సీ॥ అనుచుఁజూపఱు చెప్పి ♦ కొనుచుండ సభ్యు, లొం
డొరుఁజూచిలోన న ♦ చ్చెఱువుఁజెంది
క్ష్మాతలంబున నిట్టి ♦ శపథ మశ్రుతచరం
బని ముచ్చటించుచు ♦ నవ్వణిజులఁ
గని నేఁడుప్రొద్దువో ♦ యెనుగదా క్షేపు మీ
తగవుదీర్పుము రండు ♦ తప్పవద్దు
నా వల్లెయని నిశాం ♦ తములకేగిరివారు
నందిగుప్తుండంత ♦ నాటిరేయి

గీ॥ గృహబహిర్ద్వారమును మూసి ♦ కేఁతనదు
జనకునింబిల్చి వానితో ♦ స్వకృతమంత
యును నివేదించి సాష్టాంగ ♦ ము నొనరించి
ప్రాఙ్ముఁడోయన నిట్లు చె ♦ ప్పందొడంగె. 101

గీ॥ అఖిలపురుషార్థసాధన ♦ మర్థమెపుడు
విత్తవంతునిలోకులు ♦ వివిధగతుల
గౌరవింతురు కిల్మిష ♦ క్షపణమునకు
నర్థమెనిదానమనివిజ్ఞు ♦ లంద్రుగాదె. 102

ఉ॥ కావునఁజేతివిత్తమును ♦ గావజనుండు నుపాయవంతుడుం
గావలెఁగాని మూర్ఖుఁడనఁ ♦ గాఁజరియింపఁగరాదు జాగులే
కీవట కేగి సూర్యుఁ డుద ♦ యింపకమున్నె తదంతరంబునన్
సూవెయణంగి యుండవలెఁ ♦ జూడుము విత్తము దక్కు-
మార్గమున్. 103

గీ॥ అరయ జేపటిదినము ధ ♦ ర్మాధికృతులు
వచ్చి వృక్షంబు నడిగిన ♦ వదలి వెఱపు
నిచటిధనమా సుదర్శనుఁ ♦ డె త్తికొనియె
ననుచు ధైర్యంబుతోఁ బలుక ♦ మయ్య తండ్రి! 104

గీ॥ ఇంతమాత్రంబుఁ జెప్పితి ♦ వేని జయముఁ
గాంచుమనపక్ష మనఁగ నా ♦ లించితండ్రి
కీలుతలపోయుతఱి వచ్చు ♦ కీడుగూడఁ
జింతసేయంగవలెనంచుఁ ♦ జెలిమినుడివి. 105

వ॥ ఇట్టి విచారంబు లేనిచో శాబకంబుల రక్షింపంబోయి కోలుపోయిన బకంబుచందంబగు. అక్కథ వక్కాణించెద నాకర్ణింపుము.

## —♦ కొంగకథ ♦—

కం॥ ఒకనింబమహీజముపై
బకమిథునంబుండెఁ బిదప ♦ బహుదినములకా
బకముచెలి గర్భవతియై
యొకకొమ్మం గూడువెట్టి ♦ యుత్సాహమునన్. 107

గీ॥ అండములువెట్టి పిల్లలౌ ♦ నట్లొనర్చి
పెంచుచు నొకప్పుడది తన ♦ పెనిమిటిఁగని
మున్నిచటి పక్షిశాబక ♦ ములను క్రింది
పుట్టలోఁబాముభక్షించి ♦ పోవుచుండ. 108

గీ॥ దాని బాధలుపడ లేక ♦ తరువుమీఁది
పులుఁగులొక్కటిమై లేచి ♦ పోయినవట
వింటిరావింత; దీనిని ♦ విన్నదాది
నుండి నాచిత్తమెఱియుచు ♦ నుండెమిగుల॥ 109

చ॥ ఎఱుఁగక దీనిఁ జేరితిని ♦ యీపసికందుల కొక్కకీడురాఁ
దఱియఁగలార మేయనుచుఁ♦దావచియించుచుఁగంటనీరిడన్
వెఱపువహించిజాయఁగని ♦ వెంగలికై వడిఁదాబకోటమే
తెఱఁగునుదోఁపకుండుట మ♦దింగడుఁజింతిలికొంత సేపటన్.

ఉ॥ ఊరక నీవిదేటికెద ♦ నుమ్మలికంబువహింతువిట్లు నే
కూరినబారికిన్ వెఱపుఁ ♦ గూరక వైరివధించుకీలు నే
నారసినాఁడనింక నిను ♦ మచ్చట ముంగివసించునట్టియా
యారమునుండి పుట్టవర ♦ కీమెడఁ జేపలవైచియుంచెదన్.

చ॥ అటులఘటించినన్ మనకు♦నన్నియు సేకురునంచుఁబల్కి యం
తటఁ గమలాకరంబునకుఁ♦దాఁజని చేపలఁదెచ్చి వేయ మి
క్కుటమగు వేడ్కముంగియట♦కుంజని మీలభుజించి
పుట్టచెం
గటి కరుగెంచిచంపిభుజ♦గంబు భుజించెను కొంగపిల్లలన్.

చ॥ కాన నొకండు సేయఁజేనఁ ♦ గా మఱియొండగునంచుఁ
బల్కనన్
దానికినందిగుప్తుఁడటఁ ♦ దంద్రిఁగనుంగొనిలోన సందియం
బూనక నేను చెప్పినటు♦లుండిన భద్రముగూడు నావుడున్
సూనునిమాటకొప్పుకొనె♦సూ,తుదకున్ జనకుండుగూరిమిన్.

ఉ॥ అంతట నాతఁడుర్ జనకు♦నానిశిఁదాఁగొనిపోయి వ్రానిగ
ర్భాంతరమందునుంచి నిల♦యంబునకుం జనుదెంచితక్కరే
యంతయుఁ బుచ్చి రేపకడ♦న్యాయవిధిజ్ఞులచెంత కేగుచున్
వంతదొలంగియంతఁ బ్రతి♦వాదియు నచ్చటికేగుదెంచెడిన్.

ఉ॥ వచ్చినవారిఁ దోడుకొని ♦ వారలు వెల్వడి మఱ్ఱిఁజేరి లో
నచ్చికమూని పాదపమ ! ♦ నాటిదినంబున వీరలిచ్చటం
గ్రొచ్చిధరిత్రి విత్తమును♦గుప్తమొనర్చి యదెట్టుమీఁదటం
డెచ్చిరి?సాక్షి వౌటనీకఁ♦దెల్పుము నీవుయథార్థమంతయున్.

చ॥ అననిటఁబాతినట్టి ధన ♦ మంతయు నొక్కదినంబునన్ సుద
ర్శనుడిట కొక్కరుండె నిశి ♦ జేంకకవచ్చి వెసన్ హరించిపో
యెననెడినాద మొండల మ♦హీరుహమధ్యతలంబునుండి వ
చ్చిననటనున్న వారలల♦చిత్రపటంబులమాడ్కినుండఁగన్.

ఉ॥ అంతట నాసుదర్శనుఁడు ♦ నారసివారలఁజూచి యిద్ది దృ
ష్టాంతమటంచు నెంచకుడి♦సాలమదెక్కడ?సాక్ష్యమేడ?యీ
యంతరమీరలాజ్ఞ యిడి ♦ నంతనె తెల్పెదనంచు వేడి తా
నంతటవృక్ష మెక్కి విట♦ పాంతరముల్పరికించి యొక్కటన్.

చ॥ గుహవలె భీకరంబయిన♦ కోటరముంగనిలోనఁ దూఱఁగాఁ
దహతహలాడియప్పుడొక♦తంత్రమునారసియెండుగాదెమం
దు హరిఁదలంచిసందెడిడి♦తోడనెయింగల మంటఁజేయఁగాఁ
దహనశిఖావితానపరి ♦ తప్తతనుండయిలోన వృద్ధుఁడున్.

ఉ॥ బెగ్గిలివేడికోప కొక♦ పెట్టునఁగూయుచుఁ బైకిఁదూఁకి తా
మొగ్గిధరిత్రివారలకు♦మ్రొక్కిమహాత్మకులార! మిమ్ముల్

సిగ్గుగుఁజూడనాకు; నీకఁ ♦ జేరెద నాకము; నందిగుప్తుఁ డి
ట్లగ్గికి నన్నొసంగె వినుఁ ♦ డాతనితండ్రి డినటంచు నయ్యెడన్.

గీ॥ అసువులనువీడఁ బిదప ధ ♦ ర్మాధికారు
లాసుదర్శనగుప్తున ♦ కా ధనంబు
నెల్లదెప్పించి యిప్పించి ♦ హితముఁదెల్పి
గొఱతవేయించిరా నంది ♦ గుప్తునపుడు. 120

వ॥ అని వక్కాణించి కరటకుండు వెండియు నిట్లనియె. మొదట విచారంబుదొఱఁగి నీవచనంబుల నంగీకరించితిఁ గాని యిది యకార్యంబని తలఁపనైతి. సంజీవకుండెన్నఁడైన మన కపకారంబు గావించినవాఁడు కాఁడె? అట్టివానికిఁ గష్టంబుఁ గల్పించితివి. పాపాత్ముండవై యిందులకు నేనును నీకు సహాయుండనైతి. ఇది మనకు లగ్గుగాదు. పరుల వంచింపనెంచిన వంచకుండు తానె వంచితుండగు. ఇందులకు నీకొక్క కథ వక్కాణించెద నాకర్ణింపుము. 121

## —♦ ధ న గు ప్తు ని క థ ♦—

సీ॥ ధరణిలోన నజస్ర ♦ దంబు నాపురి నింద్ర
పాలితుండను వణి ♦ గ్వరుఁడుకలఁడు
అతనికి ధనగుప్తు ♦ డను మిత్రుఁడొకడుండె
నింద్రపాలితుఁడు దా ♦ నింటనున్న
యఱువదిపుట్ల లో ♦ హము కూలివాండ్రచే
నెత్తించికొని యా ప్త ♦ హితునికడకు

నరుదెంచి యన్న యు ♦ న్నట్లుండి యిప్పుడు
బరదేశమునకుఁ బో ♦ వలసివచ్చెఁ

గీ॥ బయనమది చేపె దీనిని ♦ భద్రపఱిచి
యెంచికన్గొని నీయొద్ద ♦ నుంచుకొనుము
వెలనిఁక నెఱుంగుదువుగదా ♦ విక్రయింపు
మప్పటికి వడ్డితో లాభ ♦ మమరు నేని॥ 122

చ॥ పరులవిధానసీవడిలి ♦ వాడుకచొప్పునఁ బుచ్చుకొమ్ము నీ
సరకువిధంబునంగనుము ♦ చౌకగనమ్మకుమాగిమీఁదటన్
మఱియొకనాటికమ్మదము ♦ మాటలవెంబడిఁ బ్రొద్దువోయెనీ
సరకురయంబునంగొనుము ♦ జాగొనరింపకుమంచుఁ
బల్కినన్. 123

ఉ॥ ఆతఁడు నేనునీకిపుడు ♦ నన్యుఁడనా ? మఱినాదుసొమ్ముగాఁ
జూతును నీదుసొమ్మెపుడుఁ ♦ జూడమఱొండుగ
నమ్ముమంచుఁ దాఁ
జేతులనప్పగించుకొనె ♦ స్నేహముతో నపుడింద్రపాలితుం
డీతఱినీకునావలన ♦ నింతశ్రమంబొనఁగూడెఁ బోయెదన్.

చ॥ అనుచువచించిమిత్రుఁడగు ♦ నాధనగుప్తునను జ్ఞ వాని వీ
డ్కొనిచేనిమందిరంబునకుఁ ♦ గొంచకయామఱునాడు లేచికూ
ర్చిన విషయాంతరంబునకు ♦ శీఘ్రమెపోయి స్వకార్యమంత
యుం
బనుపడునట్లుకూర్చుకొని ♦ వచ్చిముదంబునఁగొన్ని నాళ్లకున్.

అవ్వర్తకునిజాడ ♦ నరుడెంచి యాతఁడ
డభ్యుత్థానమొనరించి ♦ యుచితసరణిఁ
గుశలంబునారసి ♦ కూర్మితోఁబయనంపు
వృత్తాంతమడుగఁగా ♦ వించి కొంత
తడవుసల్లాపంబుఁ; ♦ దదనురూపంబుగా
నతనివాణిజ్యంబు ♦ నందుగలుగు
మంచిచెడ్డల విచా ♦ రించి లోహము కొంత
వెలహెచ్చెననివింటి ♦ వీటనిపుడుఁ
నల్ల మనలోహమేమయ్యె ♦ ననఁగనతఁడు
వదనమందలి దీనభా ♦ వంబుదోప
నాదులోహంబు కొంచెముం ♦ డంగ దాని
తోఁ గలిపి నీదులోహంబు ♦ త్రోసిగదికి. 126

తలుపులుమూసిమీాదనొక♦తాళమునై చితిఁ;గొంతమందికా
వలెనని నిన్నరానిటకు ♦ వాకిలితాళముఁదీసిచూడ లో
పల నిసుమంతమైనఁ గను ♦ పట్టదులోహము; దీనినెట్టులం
దెలుపుదునీకటంచు వెను♦దీయుచునుంటిని లోనఁజింతలన్. 

నేను నాసొమ్ముపోయిన ♦ దానికెంత
మాత్రమైననుఁ జింతింప ♦ మిత్రుఁడుంచి
నట్టి సరకాతఁడిటకు రా ♦ నయ్యా నీదు
సొమ్ముఁగొనుమిదిగో యటం ♦ చు ననన నైతి. 128

అని మది కేమిదోపకిటు ♦ లారయుచుంటిని దీనివిన్నచో
జనములుమెత్తురా ? తగు వి ♦ చారణసేయఁగ మా
గృహంబునన్

మునుపటిరీతిగాదిపుడు ♦ మూషికబాధలు పెచ్చరిల్లె దే
నినిఁ బ్రదుకంగనీయవవి♦నిక్కముగామనలోహమంతయుర్.

ఉ॥ పొంగుననోటఁగొట్టుకొని♦సోమెనటంచేని నిశ్చయించి యీ
సంగతినీకుఁజెప్ప మది ♦ జంకితి నావిని యింద్రపాలితుం
డంగదలోనణంచికొని ♦ యాతనిమోసమెఱింగి యీతఁడి
బ్బంగిధనంబుఁగైకొను ను♦పాయముబన్ని నవాఁడుగావునర్.

ఉ॥ ఈతని మాఱుమోసమొన ♦ రించినఁగాని ధనంబురాదు సం
గాతము వీడరాదనుచు ♦ గాఢముగాఁదలపోసి మిత్రమా!
నీతలఁపేనెఱుంగనె? గ♦ణించిన దైవముచేసినట్టి యీ
సేతకునేమిచేయుదుము ♦ చింతిలనేటికిఁ? బోయివచ్చెదర్.

కం॥ అనిచెప్పి సెలవుఁగైకొని
తనయింటికిఁబోయి యదిమొ ♦ దలుకొని నేస్తం
బునఁదిరుగుచు నా ధనగు
పుని యింటికి దినదినమునఁ ♦ బోవుచునుండెర్. 132

ఉ॥ అంతటనొక్కనా డతఁడు ♦ నాధనగుప్తునితోడ లోకవృ
త్తాంతములాడునట్టి సమ ♦ యంబున వీధినొకండు రేగుపం
డ్లంతికమందునమ్మ రవ ♦ మాతని పుత్రికుఁడాలకించి తా
నెంతయుఁ దండ్రి పండ్లుకొని♦ యిమ్మని యేడ్చుచుఁబొచ్చు
వెట్టినర్. 133

గీ॥ ఇంద్రపాలితుఁ డాబిడ్డ ♦ నెత్తితండ్రి
గా, వరాలుగా, బంగారు ♦ గా ఫలంబు
లిపుడు కొనితెచ్చి యిచ్చెద ♦ నేడువకుము
రమ్మని ఫలంబు లధికదూ ♦ రంబువోవ. 134

గీ॥ వెంబడించు నెపంబున ♦ వెంటనపుడు
తీసికొనిపోయి యొకచోటఁ ♦ దెలియకుండ
దాచి యాననమున మహా ♦ దైన్యభావ
ముట్టిపడుచుండ నరుదెంచె ♦ నోటలేక. 135

ఉ॥ వచ్చినయింద్రపాలితుని ♦ వాఁడుగనుంగొని బిడ్డఁడేడినా
బుచ్చికుమారుదింపి ఫల♦ముల్గొనుచుండఁగ నింతలోనఁ బా
టచ్చరుఁడోయనంగనొక♦టక్కరి గృధ్రమువచ్చి బాలునిన్
ముచ్చిరుచుండఁదన్నుకొని♦పోయెనటంచువచించెనయ్యెడన్.

చ॥ అనఘనగుప్తుఁడొక్కమొగి♦హస్తముతోనురమప్పళించుకొం
చు నిటులనీవు పాపమని♦చూడక యింతటి ఘోరహత్యకుం
బనుపడినాడవా? కినిసి♦బాలునిమోమునుఁజూచి వానిగొం
తునులిమివైవడెందమునఁ♦దోచినదా? మఱిచేతులాడెనా?

గీ॥ ఓరిచండాలుఁడా! ద్రోహి! ♦ యోరిపాపి!
నికముగాగద్ద బిడ్డ ద ♦ న్నుకొనిపోవు
నా? వినినవార లీమాట ♦ నవ్వెపోరె?
యనుచు నేడ్చుచు మరల ని ♦ ట్లనియె కినిసి. 138

ఉ॥ ఎంచికుమీవు సొమ్ము లభి♦యించినదంచు; మదించి; దాని గ్ర
క్కించెదనింకఁ జూడుమని ♦ కేకలువైచుచు లేచిపోయి శో
కించుచు న్యాయవాదులకు♦ ఖేదవిధంబును విన్నవింపఁదాఁ
గొంచుచు నింద్రపాలితునిఁ♦గూరిచివారలు పిల్చివానినిన్.

ఉ॥ ఆతనినుండి యావిధము♦ నంతయునాదట నాలకించి యా
రా! తిలకింప నీవచన ♦ మద్భుతదృష్టచరంబునాఁగ నే

నీతనియింటనే స్తమున ♦ నేర్పడ సర్వజపుట్లలో హాసం
ఘాతమునుంచిపోతి నెలు ♦ కల్దినిపోయిన వంటదానిని.

గీ॥ బుడుత గద్దతన్నుకొని పో ♦ వుటదివింత
యా? యనఁగవిని వారు ♦ లోహంబుఁబిల్ల
వాని నమ్మెడఁ దెప్పించి ♦ వారికొసఁగి
కొలుత వేయించిరా ధన ♦ గుప్తునచట. 141

వ॥ అనిచెప్పి కరటకుం డనేకవిధంబుల దమనకు నుపాలంభించు నవసరంబున మృగనాయకుండు కేసరంబులునిక్క మూర్తీభవించినమృత్యువోయన నవ ర్యకోపానలజ్వాలామాలి కాదుర్నిరీక్ష్యుండగుచుఁ జేను దెంచి. 142

ఉ॥ అంబుదనిక్వణంబువలె ♦ నార్చుచునావృషభేంద్రుఁబట్టినే
లంబడఁద్రోచి చంగున గ ♦ లంబురదావళినొత్తిపట్టి ర
క్తంబునుద్రావి యావృషభ ♦ కాంతునికాలునివీటికంపి గే
హంబున కేగుదెంచి మది♦యందనుతాపముపెచ్చరిల్లఁగన్.

గీ॥ వగలఁగూరుచుఁ జెంతకు ♦ వచ్చినట్టి
కరటకదమనకులఁ గాంచి ♦ కలఁతఁజెంది
యెంత ఘోరం బొనర్చితి? ♦ నిట్టినాకు
రాజనామంబదేల? భా ♦ రంబుగాదె? 144

గీ॥ భరణరక్షణములఁ జేసి ♦ ప్రకృతిరంజ
నంబుగావించువాని క ♦ ర్హంబుగాని
యస్మదాదులకవని రా ♦ జాహ్వయంబు
కాల్పనా? దూరమెంచని ♦ ఖలుఁడనైతి. 145

సీ॥ కోపించి సంజీవ ♦ కునిఁ జంపికొంటిని
విషవృక్షమేనిఁదాఁ ♦ బెంచి నఱుకఁ
దగునె? యిట్లొనరింపఁ ♦ దక్కెనలెంక కూ
టువకాయువృదౌరంగు ♦ నవలభూప
తికిఁగల్గు దోసఁగు; సం ♦ దియము లేదీధాత్రిఁ
బ్రదికినన్నాళ్ళు దు ♦ ర్యశముఁదెచ్చి
కొంటిఁగాదె యటంచు ♦ గోడుచేఁ గ్రిందుచూ
చుచునుండ దమనకుం ♦ డుచితసరణి
తే॥ దాయఁబరిమార్చి వీరలీ ♦ చాయఁజింతఁ
బడఁదగునె? కేరి రాజ్యలో ♦ భంబువలనఁ
గాని గర్వంబుచేఁగాని ♦ కడకుఁజేని
పదముఁగోరెడి దుష్టుండు ♦ బ్రదుకఁగలఁడె? 146
తే॥ ధరణివానికి మరణంబు ♦ దక్కవేఱు
దండమున్నదె? యిట్టి య ♦ ర్థంబు సర్వ
సమ్మతంబన సింహంబు ♦ సంతసించి
నవ్యవైభవభద్రాస ♦ నంబు నెక్కె. 147
తే॥ దమనకుఁడుఁ మ్రొక్కి యోస్వామి! ♦ తమకు లోక
మునకు శుభమగుఁగావుత ♦ మనివచించి
సకలపరిజనములు తాను ♦ సంతసించి
సౌఖ్యముగనుండెఁ దమరాజ ♦ శాసనమున. 148
చ॥ అనిజననాయకాత్మజుల ♦ కందరికవ్వెడ విష్ణుశర్మ యీ
తనరుసుహృద్విభేదమను ♦ తంత్రముసాంతముగావచించి దీ
నిని భవదీయశాస్త్రవుల♦నిత్యముఁజూపి జయంబుఁబొంది కీ
ర్తినిఁగనుఁడన్న వేడుకలఁ♦దేలిరి రాజకుమారులాత్మలన్.

## —♦ ఆ శ్వా సాం త ము ♦—

శా॥ శ్రీగౌరీపతిపద్మసంభవశునా ♦ సీరాదికోటీరశో
భాగారామలరత్నసంచయకలా♦న్యాస్తాంఘ్రిపంకేరుహా !
భోగీంద్ర స్తవనీయసద్గుణగణాం♦భోరాశి ! దైత్యాంతకా !
శ్రీగోవింద! మహీసుతాహృదయరా♦జీవాంబురుడ్బాంధవా!

కం॥ రాజపరమేశ ! ఫుల్లాం
భోజవదన ! నిఖలభూప ♦ పుంజమహాంసో
త్తేజిత భూమిభరణ ని
ర్వ్యాజఘనదయాంతరంగ ♦ యానపంతగా.

ఉ॥ నక్రమహోగ్రశాపహర! ♦ న్యాయపథావనగాఢదీక్ష ! ని
ర్వక్రపరాక్రమోాత్కమణ♦వైరికులాంతక ! కీర్తిసాంద్ర ! ది
వ్యక్రతుతంత్రరక్షణ ! కృ ♦ పారసపూరితమానసాంబుజా !
చక్రి ! పవిత్రభానుకుల ♦ సాగరపూర్ణశశాంక ! రాఘవా !

## —♦ గద్యము ♦—

ఇది శ్రీరామచంద్రకరుణాసమాసాదితకవితాచాతుర్యకాశ్యప
గోత్రోద్భవమాదిరాజు వంశపయఃపారావారరాకా
సుధాకరాబ్బరాజామాత్యపుత్రజగ్గమాంబా
గర్భశుక్తిముక్తాఫలరఘునాధామాత్య
కవిప్రణీతంబగునీతికథామంజరియను
మ హా ప్ర బం ధ ము న
తృతీయాశ్వాసము
సం పూ ర్ణ ము.



# శుద్ధాశుద్ధ పత్రము.

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 7 | హత్కారమై | హతార్కమై |
| 9 | 5 | నొకక్కట్టి | నొక్కొకట్టి |
| 10 | 1 | నీతిథాక | నీతికథా |
| 55 | 16 | మము | ముము |
| 69 | 5 | డండర | డంబర |
| 97 | 18 | కరుగెంచి | కరుదెంచి |
| 101 | 3 | డభ్యుత్థాన | భ్యుతాన |

# ఏతత్కవికృత గ్రంథములు.

| | | |
|---|---|---|
| 1. | కాళహస్తీశ్వర శతకము | 0_2_0 |
| 2. | భవానీశంకర శతకము | 0_2_0 |
| 3. | సులభ సంగీత బోధిని | 0_12_0 |
| 4. | చికిత్సానిధి | 0_12_0 |
| 5. | భారతధర్మములు | 0_8 _0 |
| 6. | చంద్రహాసచరిత్రము (శేషాద్రిరమణకవులచే నంకితము పొందబడినది) | 0_6_0 |

